సురేష్ ప్రొడక్షన్స్
ప్రైలిమిటెడ్.



# చినబాబు

డి.రామానాయుడు * ఎ.మోహనగాంధి

ఆంధ్రప్రదేశ్: సురేష్ మూవీస్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్    వెస్ట్: అన్నపూర్ణ సినీ చిత్ర

JAGATI Rs. 2-00 July 1988

33rd Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

## జులై - 1988



'కళాకారుడు వర్షపు చినుకులు లెక్కజేయడు'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004

ఫోన్ : 76697 — సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: మౌలానా అజాద్

# నిమ్మ తొనలు

డాక్టరు గారూ, రోజూ మీరు చెప్పినట్లుగానే ఉదయం వేళ రెండు పెగ్గులు తీసుకుంటున్నాను. అయినా నీరసం తగ్గడం లేదండీ - అని వాపోయాడు సుబ్బారావు.

'నేను తీసుకోమన్నది పెగ్గు కాదయ్యా, సుబ్బారావ్, ఎగ్గు....'

— కె నాగేశ్వర్రావు
నరసరావుపేట

రెండు రోజుల నుంచి మన ఊళ్లో కరెంట్ లేదు కదా - యివ్వాళ మీ మీటింగ్ ఎలా జరిగింది? - అని ప్రశ్నించాడు సాయిరామ్, కిషోర్‌ని.

'వెరీ సింపుల్, బ్రదర్ - ఆహ్వాన పత్రాలలో విద్యుత్ శాఖా మంత్రి ప్రధాన అతిథిగా విచ్చేస్తున్నారని వేశాం - ఠపీమని కరెంట్ వచ్చింది. మీటింగ్ విజయవంతంగా జరిగింది' - అని గర్వంగా చెప్పాడు కిషోర్.

— సెల్వి
నందిగామ

నూతన నటుడు త్రిజగన్మోహన రావుని పత్రికా విలేఖరి యింటర్వ్యూ చేస్తున్నాడు.

"సంపన్నులూ సాహితీ కోవిదులూ అయిన మీరు సినిమాలలో చేరటానికి కారణమేమిటి?"

'రాజకీయాల్లోకి వెళ్లేందుకు'

— కె శేఖర్‌బాబు
మైలవరం

తన సైకిలు పోయిందని కంప్లయింట్ చేశాడు విశ్వేశ్వర్రావు.

'ఏ రంగు?' - అని కానిస్టేబుల్ మొదటి ప్రశ్న.

'గ్రీన్ కలర్'

'ఎప్పుడు పోయింది?'

'నిన్న'

'ఎన్ని గంటలకు?'

'ఉదయం పదిన్నర'

'ఎక్కడ?'

'హొటల్ ముందు'

'ఏ హొటలు?'

'హొటల్ మయూరి'

'భోజన హొటలా, కాఫీ టిఫిన్ హొటలా?'

'బుద్ధి గడ్డితిని సైకిలు పోయిందని చెప్పుకున్నాను. కాదు, కృష్ణార్పణం గావించాను.'

'ఆయనెవరు?' - అని కానిస్టేబుల్ కనకయ్య వేసిన ప్రశ్నకు సమాధానం

చెప్పేందుకు విశ్వాలావు అచుట్టుపక్కల లేడు.

—యమ్‌పి వరప్రసాద్
ఇబ్రహీమ్ పట్నం

రెండు ఒకట్లు ఎంత ? - అని టీచరు గారు మోహనకృష్ణని అడిగారు.

'ఒకటికి ఒకటి కలిపితే రెండు; ఒకటిని ఒకటితో హెచ్చవేస్తే ఒకటి' - అని తెలివిగా సమాధానం చెప్పాడు మోహన్‌కృష్ణ.

'మరి, రెండు రెళ్లు ?'

'ఇన్నాళ్లూ నాలుగు అనుకున్నాం - ఇప్పుడు 'ఆరు' అంటున్నారు జంధ్యాల' - అని మోహనకృష్ణ చెప్పినది, సిని మాల సంగతి తెలియని టీచరు గారికి బోధపడలేదు.

—వై భాస్కరరావు
కొణకంచి

నన్నిలాగే ఏడ్వనీ - ఆ ఏడుపులోనే నా బాధంతా కరిగిపోనియ్ - నా కన్నీళ్లు తుడవకు, డియర్' - అం గంగాధరం వైపు జాలిగా చూసిం మాధురి.

'మాధురీ డియర్ ఆ కన్నీళ్లు తుడవక పోతే, అవి బొట బొటా రాలి, నీ మేకప్ పాడు చేస్తాయి. అప్పుడు నేను నిన్ను చూడగలనా ?' - అన్నాడు గంగాధరం.

—జి రాము
నందిగామ

అమ్మా నేను రామూతో కాసేపు ఆడు కొని వస్తాను - అన్నాడు శ్రీనివాస్ తన తల్లితో.

'వద్దురా - ఆ రామూ అంటే నా కిష్టం లేదు.'

'అయితే, యుద్ధం చేసి వస్తాను.'

—వి రమణ
చీరాల







# పాఠకుల తీర్పు

శ్రీయుత చందూర్ గార్కి: వందనాలు (మా జిల్లాలో ప్రముఖుల భాష) .... 'జగతి' అందింది. పుస్తక సమీక్షకు చాలా సంతోషించాను. 'క్షీర సాగరమ్' నుంచి అమృతం ఉద్భవించింది. వారికి నా ధన్యవాదాలు తెల్పగలరు.

—అద్దంకి మన్నార్
న్యూఢిల్లీ - 3

చందూర్ గారికి: మద్రాసు ముచ్చట్లు, మీ పర్యటన విశేషాలు కళ్లారా చూసిన అనుభూతిని కలిగిస్తున్నాయి. ఆఫీసు చిరునామాకు వస్తుందేమో, ఫైల్సు, టేపులు పక్కకి నెట్టి, ముందు ఆసాంతం చదివేస్తాను. ఆ తర్వాత యింటికి పట్టుకెళ్లి, 'నిమ్మతొనల' తో సహా మా అమ్మాయిలకు యిస్తాను.

—తురగా జానకీరాణి
హైదరాబాదు -27

చందూర్ గారికి: నమస్కారములు .... మాన్య మిత్రులు బెజవాడ గోపాల రెడ్డి గారు మీకు ఎంతో సన్నిహితులు. వారి అనుభవాలు, జ్ఞాపకాలు మన తెలుగు. వారి సాంస్కృతిక చరిత్రకు ఆకరాలు కాగలవు. వాటిని ముందు తరాలవారి కోసం వారు లిఖిత పరుస్తారని ఆశిస్తున్నాము.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప - 4

'జగతి' సంపాదకులకు: 1988 మార్చి నెల సంచిక. పేజీలు 35, 36 .... 'కొత్త పుస్తకాలు' శీర్షికలో, రాహుల్ సాంకృత్యాయన రచన 'ఋగ్వేద ఆర్యులు' సమీక్షలో. సరోజనీ ప్రేమ్‌చంద్ గారు మనకు ఎరుక పరిచిన విశేషాలలో, ఒక చిన్న అభిప్రాయాన్ని విశదీకరిస్తున్నాను. ఋగ్వేదములో యించు మించు రుక్కులన్నీ ఇంద్ర స్తోత్రాలే - యదార్థము. ఇంద్రునికి రూపములేదు, సర్వశక్తి మంతుడు, సర్వాంతర్యామి .... సామవేద స్తోత్రాల్లో 'ఇంద్రో విశ్వస్తి రాజనే' అని విశదీకరణ జరిగింది.... ఇంద్రునికి చేదోడుగా విష్ణువు (పురాణయుగంలో) నెరవేర్చిన కర్తవ్యాన్నిబట్టి ఉపేంద్రుడు. అన్నారు. మంత్రపుష్పంలో 'త్వం ఇంద్రః, త్వం విష్ణు, త్వం బ్రహ్మాత్వం ప్రజాపతిః' అని వుంటుంది.... ఇంద్రునే 'భరతుడు' అనే స్తోత్రం కూడా ఉన్నది. 'హిందు' శబ్దము 'సింధు' నుంచి కాదు, 'ఇందు' (ఇంద్ర) నుంచి వచ్చినదని కావ్యకంఠ గణపతి మునీంద్రులు వివరించారు.

—బియస్ రామారావు
మద్రాసు - 24

---

స్వాతంత్ర్య పౌరులకు స్వాతంత్ర్యమంటే ఏమిటో విడమరిచి చెప్పవలసిన పనిలేదు. —వో పెన్‌హిమ్

# ప్రాచీన సాహితి

వచ్చిన రాత్రులే తిరిగి వచ్చుట పోయిన వాసరంబులే
వచ్చు టెఱింగి గూఢతర వర్తనులై పునరుక్త కార్యముల్
నిచ్చలు సేయుచున్ జనులు నిశ్చయ వృత్తిం జరింతు రీభవా
భ్యుచ్చయ రీతిచే జెడి కుబుద్ధులు సిగ్గు వహింప రెంతయున్

-భర్తృహరి



కుమతియు జుట్టంబు గొండెగాడు ప్రియుండు
  కరుణా విహీనుడు కార్యదక్షు
డొరుల సంపద కోర్వకుండెడు వ్రతనిష్ఠ
  క్రత్వనుష్ఠానంబు కపటచింత
దుర్బల హరణంబు దోశ్శక్తికి ఫలంబు
  కృతత మెఱుంగక యున్కి కీర్తిగరిమ
ప్రజల గోడాలకింపమియు ప్రాభవ చిహ్న
  దబ్బరలాడుట తగవు నేర్పు
పాపభీరుడు గాని భూపాలుకునకును
నిట్టి నృపు నాశ్రయించిన నేమి గలదు
ధార్మికస్థలి యాచన దగ్ధ మగును
రామలింగేశ రామచంద్రపురవాస

—రామలింగేశ శతకం

తమి బూదీగెల తూగుటుయ్యేలలల బంతాలాడుచున్ దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్ చక్కగా జాగి మిం
టి మొగంబై చనుదెంచు టీవి గనుగొంటే దివ్యమౌనీంద్ర నా
క మృగీనేత్రల మీద గయ్యమునకుం గాల్ చాచలా గొప్పెడిన్.

—పింగళి సూరన కళాపూర్ణోదయం

# పాత కేళ్ల నాటి పిక్చర్

******************************************

## రాజ్యలక్ష్మీవారి 'బందిపోటు'

మీ కలలకు రూపకల్పన, మీ ఆశయాల సాఫల్యమూ, మీ ధైర్య సాహసాలకు దర్పణమూ ఈ 'బందిపోటు' అంటున్నారు నిర్మాతలు. ఈ సినిమా 'బందిపోటు' దుష్టశిక్షణ గావించి, శిష్ట రక్షణతో బాటు రాకుమారిని చేపట్టి, రాజ్యాభిషిక్తుడవుతాడు. కథానాయకుడు సింహాసనాధిపతి అవడంతో కథ ముగుస్తుంది. ....హింసను హింసతో జయించలేమని తమ్మునికి హితవు చెప్పిన ధర్మనాయకుడు (నాగయ్య) శూరసింహుని (రాజనాల) కపటనాటకంలో చిక్కుకుని, దౌర్జన్యానికి గల కృత్రిమ విజయాన్ని వీరనాయకుని (మిక్కిలినేని) మృత్యువులో చూస్తాడు. ఈ దారుణానికి గుండె పగిలి అతను కూడా మరణిస్తాడు. తండ్రీ, పిన తండ్రుల మరణంతో నరసింహ నాయకుడు (ఎన్. టి. రామారావు) ముసుగు వీరుడై, నోరులేని ప్రజలను కాపాడేందుకు ధీరోదాత్తుని వలె నిలుస్తాడు. ఈ ధీరుడు లోగడ, పాత ముసుగు వీరుడు మందారమాల (కృష్ణకుమారి) నగలు అపహరించిన సందర్భంలో, ఆమెను కాపాడి వున్నవాడవటంచేత, 'వగల రాణివి నీవు - సొగసు కాడను నేను - ఈడు, జోడు కుదిరింది మేడ దిగిరా' - అంటాడు. ఆమెగారు ఇతన్ని పట్టిద్దామని వచ్చి, పట్టుబడుతుంది - అది సహజమే అనుకోండి. కాని దీనంతటికీ కారణం కాళ్ళు పడిపోయిన సత్యసేన మహారాజు (గుమ్మడి), దుర్మార్గుడైన తన బావమరిది శూరసింహునికి, రాజ్యపాలన వొప్పగించడం. ఇది సాహస కృత్యాలతో కూడిన జానపద గాధ కాబట్టి యిష్టం వచ్చిన రీతిని మెలికలు తిరిగి, సొగసులు పోయింది రాజుగారు తన కూతురు చెప్పదలుచుకున్నది కొంచెం చెప్పనిస్తే కత్తి యుద్ధాలతోటీ, సాముగరిడీలతోటీ పని వుండేది కాదు. ధర్మనాయకుని పాత్ర ఒక్కటే కాస్త వివేకవంతమయింది - దానిని మొదట్లోనే తుంచేశారు. ప్రజారంజకత ప్రధానంగా విఠలాచార్య దర్శకత్వంలో నిర్మితమైనది – ఈస్ట్‌మన్ కలర్ దృశ్యాలుగల ఈ చిత్రం!

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' - జులై 1963

ఏకాకిగా నిలబడ గలవాడే ఈ ప్రపంచంలోని అతి ధైర్యవంతుడూ, స్వాతంత్ర్య ప్రియుడూను.

—ఇబ్సెన్

# వెన్నెల కెరటాలు



## జాతీయోత్సాహం

1895 లో మొదటి గోదావరి మండల రాజకీయ సభ జరిగింది. అదొక గొప్ప చారిత్రక సంఘటన. దానికి నాయకత్వం వహించిన వారు 'ఆంధ్ర భీష్మ' న్యాపతి సుబ్బారావు పంతులు. ఆ సభలో చదవడానికి చిలకమర్తి పదునాలుగు పద్యములు రచించారు, చదివారు. ఇట్టి యాంగ్లేయ దొరతనం బేలుగాక - ధర్మమతితోడ నాచంద్రతారకముగ!' అంటూ ఆకాంక్షించారు. అప్పటికి మేధావులందరి హృదయాలూ అదే ఆకాంక్ష వెలువర్చేవి. కాని మరొక్క పది సంవత్సరాలు గడచీ గడవక ముందే చిలకమర్తిలో జాతీయభావాలు రగులుకొన్నాయి. ఆంగ్ల ప్రభుత్వ ద్వేషమూ పెచ్చరిల్లింది. దీనికి ప్రధాన కారణం బిపిన్‌చంద్రపాల్ గారు రాజమహేంద్రి వచ్చి వరుసగా మూడు రోజులు ఉపన్యాసాలిచ్చినపుడు వారికి తెలుగు అనువాదకులుగా చిలకమర్తి వ్యవహరించాడు. 'తెల్లవారను గడుసరి గొల్లవారు పితుకుచున్నారు, మూతలు బిగియగట్టి' అంటూ భారతదేశాన్ని చక్కని గోమాతతో ఉపమించి చెప్పిన పద్యం యావదాంధ్రలోనూ జాతీయోద్యమోత్సాహం కలిగించింది.

—సోమసుందర్
'స్రవంతి' లో

## అన్నమయ్య

అన్నమయ్య కేవలం సంకీర్తనలే కాకుండా శృంగార మంజరి, పన్నెండు శతకాలు, సంస్కృత వేంకటాచల మహాత్మ్యం, సంకీర్తన లక్షణం, ద్విపద రామాయణం మొదలైన గ్రంథాలను రచించాడు. వీటన్నింటిని అతని కుమారుడైన పెద తిరుమలాచార్యులు రాగి రేకులపై చెక్కించి దేవాలయ ప్రాంగణంలో భూనిక్షిప్తం చేసారు. ఆ రాగి రేకులను తిరుమల తిరుపతి దేవస్థానం వారు 50 సంవత్సరాల క్రితమే వెలికితీసి వాటిని శుభ్రపరచి అందులోని సంకీర్తనల్ని పుస్తకాలకెక్కించారు. ప్రస్తుతం అన్నమయ్య కృతుల్లో పన్నెండువేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, శృంగార మంజరి, అలిమేలు మంగమ్మపై వేంకటేశ్వర మకుటంతో వ్రాసిన ఒక్క శతకం మాత్రమే లభించాయి. ఇలా బాల్యమాదిగా మహాభక్తుడై వైష్ణవమత భక్తితత్వాన్ని భగవంతుని దివ్యావతార లీలల్ని మన

సారకీర్తించి ఆడి పాడి, ఆ బాలగోపాలాన్ని మురిపింపజేశాడు. తరువాత ప్రఖ్యాత వాగ్గేయకారులైన క్షేత్రయ్యన, రామనామ త్యాగరాజు వంటి మహానియులకు మార్గదర్శకుడయాడు.

—హెన్నా లీలావతమ్మ
'కోసావాణి'లో

ఎన్నాళ్ళనుంచో, హాలీవుడ్ చూడాలనుకుంటున్న అభిలాష ఈనాటికి తీరింది. ఇదివరలో అమెరికా మూడు పార్లు వెళ్లినా హాలీవుడ్ చూడ్డం కుదరలేదు. ఈసారి మా ఇద్దరబ్బాయిలూ చాలా పట్టుపట్టారు. పైగా, 'లాస్ ఏంజల్స్' లో వున్న మా అబ్బాయి స్నేహితుడు డాక్టర్ శశిధర్ (నిర్మాత, దర్శకులు, శ్రీ వి శ లా బా ర్య గా రి కుమారుడు) మమ్మల్ని రమ్మనమని ఆహ్వానించాడు..... మేంట్రాంలో వెళుతూ వుంటే ఒకచోట చాలా పెద్ద ప్రవాహం కనిపించింది. మాంట్రాం ఆ ప్రవాహంలోకి వెళ్లి పోతుందేమోనన్న భయం కలిగింది మాలో. కాని అంతలోనే 'అనౌన్స్‌మెంట్' రావడం, ఆ ప్రవాహం రెండుగా చీలి ట్రాం వెళ్లడానికి మార్గం ఏర్పడడం క్షణంలో జరిగిపోయాయి. ఇదే 'టెక్నిక్' 'టెన్ కమాండ్‌మెంట్స్'లో చిత్రీకరించారు... 1911లో హాలీవుడ్‌లో మొదటి స్టూడియో నిర్మాణం జరిగింది. 1913 లో "సెసిల్-డి-మిల్లీ" తీసిన మొదటి కథా చిత్రం (Feature Film) "ది స్క్వేర్‌మాన్" (The Square Man) నిర్మించిన తర్వాత, హాలీవుడ్‌లో 8 ప్రఖ్యాతి వ హిం చి న స్టు డి యో ల నిర్మాణం జరిగింది. (1) పారమౌంట్ (2) ఫాక్స్ (3) మెట్రో గోల్డ్విన్ (4)వార్మర్‌బ్రదర్స్(5)ఆర్.కె.ఓ.(6) యూనివర్సల్ (7) కొలంబియా (8) యునైటెడ్ ఆర్టిస్టుస్. వీటిలో ఆరు స్టుడియోలు మూతపడగా, ప్రస్తుతం రెగ్యులర్‌గా చిత్రాలు తీస్తున్న సంస్థలు రెండే (1) పారమౌంట్ & (2) కొలంబియా పిక్చర్స్ మాత్రమే-అయితే 50, 60 టెలివిజన్ చిత్రాలు నిర్మించే స్టుడియోలు ప్రస్తుతం నడుస్తున్నాయి.

—ఆదినారాయణరావు
'విజయచిత్ర' లో

*

స్నేహాలు మనంతట మనం చేసుకునేవి కాదు - ఈ జీవిత ప్రయాణంలో సేదదీర్చే చెట్ల నీడలు.

—ముర్రే

* * *

విశ్వప్రభూ, మాకు సమస్తమూ ప్రసాదించావు. ఈ ఒక్కటీ కూడా దయ దలచి కరుణించు-కృతజ్ఞత గల హృదయం!

—హెర్బర్ట్

* * *

అలవాట్లు మొదట్లో సాలెగూళ్లు—ఆపైన యినుపగొలుసులు.

—స్పానిష్ సామెత

# మానవ ప్రగతి

## రొమనెంకొ

రోదసిలో 326 రోజులు గడిపి సోవియట్ వ్యోమగామి యూరీ రొమనెంకొ రోదసి చరిత్రలోనే ఒక అపూర్వమైన ఘట్టాన్ని సృష్టించాడు. తర్వాత జనవరి 20 వ తేదీన మాస్కోలో ఒక పత్రికా విలేకర్ల సమావేశంలో పాల్గొన్నాడు. ఆ సమావేశంలో 100 మందికి పైగా సోవియట్, విదేశ పత్రికా విలేకర్లు పాల్గొన్నారు. ఎంతో సరదాగా, నవ్వుతూ, విస్పష్టంగా ఆయన సమాధానాలు యిచ్చారు. రొమనెంకొకు సుదీర్ఘ రోదసి యాత్రలు కొత్తేమీ కాదు. ఆయన లోగడ ఏకబిగిన 95 రోజుల పాటు రోదసిలో గడిపారు. రెండవ సారి 326 రోజులపాటు వున్నారు. 'రెండవ యాత్ర అనంతరం కూడా నేను హాయిగా వున్నాను. నా అంతట నేనే నిలబడగలిగాను, నడవగలిగాను. నా కాళ్లు నా స్వాధీనంలోనే వున్నాయి' అని ఆయన ప్రకటించారు. రొమనెంకొ యాత్ర జరపడానికి ముందు ముగురు సోవియట్ వ్యామగాములు 236 రోజులపాటు రోదసిలో నిర్విరామంగా విహరించారు. వారిలో ఒకరైన డాక్టర్ ఒలెగ్ అత్కోవ్ మానవ శరీరంపై భారరాహిత్య స్థితి ప్రభావాన్ని అధ్యయనం చేశారు. దీని మూలంగా శరీరంపై ఎటువంటి ప్రమాద భరితమైన పర్యవసానాలు వుండవని ఆయన స్పష్టంచేశారు. రోదసి యాత్ర సమయంలో శరీరంలో కాల్షియం కొరత ఏర్పడుతుంది. రోదసి యాత్ర జరిపే ప్రతి ఒక్కరికీ యిది సంభవిస్తుంది. ఇది కేవలం సోవియట్ వ్యోమగాములకు మాత్రమే పరిమితం కాదు. దీర్ఘ కాలం పాటు రోదసిలో వుంటే కొరత పది శాతం వరకూ వుంటుంది. భార రాహిత్య స్థితిలో శరీరంలో రక్తం పరిమాణం, యితర ద్రవాల పరిమితం తగ్గిపోతుంది. ఇది పాక్షికంగా డీహైడ్రేషన్‌కు దారితీస్తుంది. ఈ విషయం నిపుణులందరికీ తెలుసు. రొమనెంకొ భూమికి తిరిగి వచ్చిన తర్వాత భూమి మీద కూడా నెమ్మదిగా వ్యాయామాలు చేయడం ప్రారంభించారు. కొద్ది రోజుల తర్వాత ఆయన మామూలు పరిస్థితులకు వచ్చారు.

## బ్లడ్ ప్రెషర్

అతి తక్కువగా అంచనా వేయ బడే వ్యాధులలో మొట్టమొదటిది అధిక రక్తపీడనం. దీనిని సాధారణంగా తక్కువగా అంచనా వేయడమేకాక పూర్తిగా నిర్లక్ష్యం చేయడం సర్వ సాధారణం. అధిక పీడనం ఎటువంటి రోగ లక్షణాలు లేకుండా ఉండడం వలన ప్రమాద స్థితికి చేరేవరకు గుర్తిం చక పోవడం కద్దు...... తీవ్రమైన మానసిక ఆందోళనలు ఉద్రేకత గల ఉద్యోగాలలో పని చేస్తున్నవారు, స్థూలకాయం కలవారు, తమ రక్త పీడనాన్ని అప్పుడప్పుడూ పరిశీలించు కోవాలి. తీవ్రమైన మానసిక ఆందోళ నలకు కోపోద్రేకాలకు ఆవేశాలకు పగ్గం వెయ్యాలి; లేకపోతే దానివలన సంభవించే గుండెపోటుతో పోల్చి చూసుకొని ఆవిధంగా ఆవేశపడటం లాభదాయకమేనా అని ప్రశ్నించుకోండి. ఫలితాలు మీరే చవి చూడవచ్చు. కోపోద్రేకాలు, అసహనం ఆవేశాలను తగ్గించుకోవడానికి జీవన సరళి అల వాట్లలో కూడా మార్పు అవసరం కావచ్చు. సాంఘిక పద్ధతులు, వాతా వరణం ఒకదానితో ఒకటి పోటిపడే ఉద్యోగం మరియు కుటుంబ లక్ష్యాలు, జీవితం మధ్యలో సంభవించే సంక్షో భాలు అన్నీ కలసి వత్తిడికి దారి తీస్తాయి. 'ఆహారంలో ఎక్కువ ఉప్పు ను ఉపయోగించడం వలన హృదయ స్పందన కఠినతరం మౌతుంది' అని క్రీస్తు పూర్వం రెండువేల సంవత్స రాల క్రితమే చైనా చక్రవర్తి హువాంగ్ టి పేర్కొన్నారు. ఆధునిక పరిశోధ నలు ఈ సంబంధాన్ని ధృవపరి చాయి. అధిక రక్త పీడనం గలవారు ఉప్పు లేని ఆహారానికి కట్టుబడి ఉండాలి. శరీరంలో క్రొవ్వుపదార్థాలు ఎక్కువగా పేరుకు పోవడం వలన స్థూలకాయం ఏర్పడి అధిక రక్త పీడనానికి దారి తీస్తుంది. శారీరక శ్రమ లేదా వ్యాయమం లేకపోవడం, తమకు అవసరమైన కెలరీలకంటే ఎక్కువ ఆహారం తీసుకోవడం వలన శరీరంలో క్రొవ్వు పెరిగి స్థూలకాయం ఏర్పడి గుండెపై భారం పెరుగు తుంది. మనం తీసుకొనే ఆహారాన్ని బట్టియూరిక్ ఆసిడ్ లవణాలు కొలెస్ట రల్ రక్తనాళాల (ధమనుల) గోడలపై పేరుకు పోయి రక్త ప్రసారానికి ఆటంకం ఏర్పరచి అధిక పీడనానికి దారితీస్తుంది. తులనాత్మక ఆహారం తీసుకొంటే మనకవసరమైన కాలరీల ఆహారం, విటమిన్లు, లవణాలు సరైన మోతుదులతో లభిస్తాయి.

## ఆస్కార్‌లు

వియత్నాం యుద్ధ నేపథ్యంతో నిర్మించిన 'ప్లాటూన్' చిత్రం, సర్వకా లాభిమాన కళాకారుడు పాల్ న్యూమన్, బధిరనది మార్లే మాట్లిన్‌లకు ఈ ఏడాది అకాడమీ అవార్డులు లభించాయి. హన్నా అండ్ హర్ సిస్టర్స్‌లో నటిం చిన మైకేల్ కేన్ ఉత్తమ సహాయ నటుని అవార్డును, డయాన్ వీస్ట్ ఉత్త మ సహాయ నటి అవార్డును పొందారు. నటవర్గంలో 'ఆస్కార్' స్వర్ణ ప్రతిమలు అందుకున్న నలుగురు విజేతలలో

ఎవరూ కూడా ఇదివలో వాటినిపొంద లేదు. కాగా, అవార్డుపొందిన నటి మార్లిన్ అప్పటికి ఒకేఒక్క చిత్రంలో నటించింది. ఆమె ఈ అవార్డుకై నామినేట్ అయిన తొలి బధిర నటీమణి కావడం కూడా గమనార్హం. పాల్ న్యూమన్ విషయానికొస్తే ఆయన ఇదివరలో ఈ అవార్డును ఆరుసార్లు కోల్పోయారు. కేన్‌కి కూడా మూడు సార్లు అవకాశం పోయింది. రంగస్థల నటి వీస్ట్‌కిమాత్రంఇది మొదటి 'నామినేషన్'. కాగా, చలన చిత్ర విజయ సాధనకై అత్యంత ప్రతిష్ఠాత్మకమైన అకాడమీ అవార్డు పొందిన వ్యక్తి అగ్ర శ్రేణిలో వున్న ఒక యువ ప్రతిభాశాలి; అతడి చిరస్మరణీయ విజయాల జాబితా రోజు రోజుకు పెరిగిపోతూ తారా పథానికి చేరుకునితళుకులీను తున్నప్పటికీ ఇంతకు ముదెన్నడూ అతడికీ పురస్కారం లభించలేదు.ఆ వ్యక్తి మరెవరో కాదు - స్టీవెన్ స్పీల్‌బర్ ఈ ఏడాది ఉత్తమ చిత్రం అవార్డు పొందిన 'ప్లాటూన్' - అకాడమీ ఆఫ్ మోషన్ పిక్చర్ర్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ సత్కారం పొందిన వియత్నాం సంబధితచిత్రాలలోదిరెండవది. ఈ కోవకు చెందిన 'డీర్' హంటర్' అనే 1979 నాటిచిత్రానికి ఇదివరలో అకాడమీ అవార్డులభించింది. ఈసారి అకాడమీ అవార్డులలో - ఈ ఏడాదిలోని అగ్ర శ్రేణి చిత్రాల విషయంలో -ఇదివరకటి సంవత్సరాలలో కంటె అధికంగా తుల నాత్మకత కనిపించింది. 'ప్లాటూన్' కు నాలుగు ఆస్కార్‌లు; 'హన్నా అండ్ హర్ సిస్టర్స్', 'ఎ రూమ్ విత్ ఎ వ్యూ' చిత్రాలకు క్కొక్కదానికి మూడేసి ఆస్కార్‌ల వంతున లభించాయి. 'ది కలర్ ఆఫ్ మనీ' లోని తన విశిష్ట పాత్ర పోషణకుగాను పాల్ న్యూమన్ ఎట్టకేలకు ఆస్కార్‌ను సాధించ గలిగాడు. వియత్నాం యుద్ధంలోని ఒక పదాతి దళాన్ని స్తంభింపజేసిన ఉద్రిక్తతల తాలూకు వేదనను వెల్లడించే 'ప్లాటూన్' చిత్రం - హాలీవుడ్‌లోని ప్రధానమైన స్టూడియోల తిరస్కారం పొందిన ఒక స్క్రిప్టు చిత్రీకరణలో డైరెక్టర్ - స్క్రీన్ రైటర్ ఆలివర్ స్టోన్‌కు గల వజ్ర సంకల్పాన్ని ప్రతిబింబిస్తుంది 'హనా అండ్ హర్ స్టసిర్స్' చిత్రం కేన్, వీస్ట్‌లకు వారి మొదటి 'ఆస్కార్'లను ఇప్పించడంతోపాటు వూడీ ఆలెన్‌కు 'ఒరిజినల్ స్క్రీన్‌ప్లే' అవార్డు కూడా తెచ్చిపెట్టింది. 'ఎ రూమ్ విత్ ఎ వ్యూ' చిత్రం తన సాహితీ గరిమకు, విశిష సోయగానికి - ఆర్ట్ డైరెక్షన్, కాస్ట్యూమ్ డిజైన్, స్క్రీన్‌ప్లే అడాప్షన్ రంగాలకు అవార్డులు పొందింది. బధిరులకు సంబంధించిన మార్క్ మెడాఫ్ నాటకం ఆధారంగా తీసిన 'ఛిల్డ్రెన్ ఆఫ్ ఎ లెస్సర్ గాడ్' చిత్రాన్ని - ఇప్పుడు చిన్న బృందంగానే వున్నప్పటికీ, క్రమేణ పెరుగుతున్న హాలీవుడ్ మహిళా దర్శకుల బృందంలోని రాండా హెయిన్స్ రూపొందించారు. అకాడమీకి చెందిన ప్రధాన గౌరవ 'ట్రోఫీ' అయిన ఇర్వింగ్ జి. థాల్‌బెర్గ్ మెమోరియల్ అవార్డును 39 ఏళ్ల డైరెక్టర్ -

ప్రొడ్యూసర్ - రైటర్ స్టీవెన్ స్పీల్ బెర్గ్‌కు బహూకరించడం ఆస్కార్ ఉత్సవ విశేషాలలో ఒక ముఖ్యాంశం. ఇదివరలో ఆల్ఫ్రెడ్‌హిచ్‌కాక్, జార్జి స్టీవెన్స్, విలియం వైలర్‌లకు లభించిన ఈ ట్రాఫీని అందుకున్న అతి పిన్న వయస్కుడు స్పీల్ బెర్గ్ కావడం గమ నార్హం.

అతడు మూడోఏట చెవిటివాడ . . . . విధివక్రించి ఆయేడే పోలియో వచ్చి అతని కాళ్లని కాటే సింది - తోడులేందే నడవలేని నిస్సహాయుడైన పసిబాలుడు. . పేరు బి.యస్. ప్రసాద్ - ఏలాగో ప్రయ త్నించి ప్రయత్నించి కొన్నేళ్లకి కొద్దిగా స్వయంగా నడవగలిగేవాడయ్యాడు. నిరాశతో కుంగిపోకుండా తెచ్చిపెట్టు కున్న ఉత్సాహంతో పాకుతూ - పడుతూ బళ్లోకి వెళ్లేవాడు. అలా అలా పదోతరగతి దాకా వచ్చాడు. అక్కడ నుండి వికలాంగుల వృత్తి విద్యాకోర్సు శిక్షణా కేంద్రం త్రివేంద్రంలో ప్లాస్టిక్ పనుల్లో రెండేళ్ల శిక్షణ పొందాడు. అక్కడే రేడియో మెకానిజం - వడ్రంగి పని కూడా నేర్చుకున్నాడు. . . కాలం గడిచింది. . . . . ఇరవై తొమ్మిదేళ్ల వాడైన ప్రసాద్ 1985 ఏప్రిల్ నుండి ఎ.యస్.యల్.పి. త్రివేంద్రం ప్రాజెక్టు లో స్వీపర్‌గా పనిచేయడం ప్రారంభిం చాడు. భవంతిని శుభ్రంగా ఉంచడం - ఎలక్ట్రానిక్ పరికరాలని జాగ్రత్తగా సం రక్షించడం, కంప్యూటర్ గదులు - చక్కగా ఉంచడం అతని పనులు తన వృత్తికి అంకితమై కష్టించి పని చేస్తూ ఎ.యస్.యల్.పి. ప్రాజెక్టు అధి కారుల మన్ననకు పాత్రుడైనాడు ప్రసాద్. అత్యంత పరిశుభ్రతను పాటిం చడంలోనూ, గదులను చక్కగా ఉం చడంలోనూ, ఎంతో నైపుణ్యం కన పరచిన అతని పేరుని అధికారులు 1987 వ సంవత్సరము జాతీయ వికలాంగుల సంక్షేమ అవార్డుల కమి టీకి నివేదించడంలో ఆశ్చర్యమే ముంది! తన అంగవైకల్యాన్ని అధిగ మించడమే కాక, తను అత్యంత శక్తి సామర్థ్యాలను, నైపుణ్యాన్ని కనపరచి నందుకు అవార్డు అతణ్ణి వరించింది. ఆత్మ విశ్వాసం కలిగి ఉంటే ఫలితాలు అద్భుతంగా ఉంటాయని నిరూపిం చింది అతని జీవితం.



రమ్యంగా సంభాషణ సాగించే వారిని రెండు రకాలుగా విభజించ వచ్చును. ఎదుట వారు చెప్పేది శ్రద్ధగా ఆలకించే వారు ఒకరకం, వారలా చెబుతూండగా తాము విసర దలుచుకున్న ఛలోక్తి గురించి ఆలో చించేవారు మరోరకం. —బివ్వెన్

*    *    *

స్త్రీ పురుషులలోని ముఖ్యమైన తేడా ఏమిటంటే, పురుషుడు తనకి కావలసిన రూపాయి వస్తువుకి రెండు రూపాయిలైనా యిచ్చి కొంటాడు. స్త్రీ యేయో తనకు అక్కర్లేని రెండు రూపాయిల వస్తువుని రూపాయికి కొంటుంది. — బెంజ్



# కొత్త పుస్తకాలు

'దోషులకు శిక్షతథ్యం – ' రచయిత : వ్లాదిమర్ మోల్చనోవ్. తెనుగుసేత. ఎమ్. సారధి. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. వెల : రు 12-00.

నాజీయుద్ధ నేరస్థులు - వారి సంరక్షుల వివరాలు ఈ రచనలోని అంశాలు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో నాజీలు, సోవియట్ భూభాగంపై దురాక్రమణ జరిపిన సమయంలో, ఆ నాజీమూకలు చేసిన అత్యాచారాలను, కిరాతక హత్యాకాండను కళ్ళకు కట్టినట్టు చూపిస్తాడు రచయిత. ఇందులోని సంఘటనలు పాఠకుణ్ణి అత్యంత భయానకము, రోమాంచితము అయిన పరిస్థితికి లాక్కువెళ్ళతాయి. నాజీయుద్ధ నేరస్థులలో కొందరు అమెరికా, పశ్చిమ జర్మనీ, కెనడా దేశాల్లో శిక్షను తప్పించుకొని హాయిగా జీవిస్తున్నారని కూడా రచయిత పేర్కొన్నారు. నలభై ఏళ్ల క్రితం జరిగిన ఈ భయానక భీతావహ సంఘటనలు మనని భయపెట్టడమే కాకుండా, మనిషిలో ఇంతటి క్రౌర్యము అమానుషమూ దాగివున్నాయా అనే విభ్రమంలో ముంచుతాయి.

—అన్నపూర్ణా రెడ్డి

'ప్రసార తరంగిణి' (రేడియో కార్యక్రమాలపై వ్యాస సంకలనం) కూర్పు : పన్నాల సుబ్రహ్మణ్య భట్టు. ప్రచురణ : సామాన్య ప్రచురణలు. చెరుకుపల్లి వారి వీధి, పిఠాపురం. వెల : రు. 25-00.

"ప్రసారము" అంటే రేడియో ప్రసారము అనే అర్థంలో తీసుకుంటే యీ గ్రంథంలోని కొన్ని వ్యాసాలు ఎందుకు చేర్చారా అని అనిపించక మానదు. కానీ వ్యాస సంకలనకర్త ప్రసారం అంటే 'కమ్యునికేషన్ మీడియా' అనే విస్తృత పరిధి గల్ల అర్థంలో వాడారు కాబట్టి పత్రికా రచన, చలనచిత్రాల ద్వారా వుత్తేజం, సందేశం వంటి రచనలు అసందర్భంగా లేవు.

రేడియో ప్రసంగాలు ఎట్లా వుండాలి అనే విషయం ప్రధానంగా తీసుకొని పరిశీలించిన రచనలే ఎక్కువగా వున్నాయి. దాదాపు పది మంది ప్రముఖుల చేత వ్రాయించి

చదివించి ఆపైన ప్రచురించినవి.

రేడియో నాటకం, సంగీత నాటకం, నేపథ్యసంగీతం, వాద్యబృంద సంగీతం రచనలు యివి ఉత్తమ రచనలు.

రేడియో ప్రసంగం అనగానే కృష్ణ శాస్త్రిగారు గుర్తుకు రాకమానరు. తేలికభాషలో కబుర్లు చెపుతున్నట్లుగా వుండే వారి ప్రసంగాలు వినడమే ఒక శిక్షణ తరగతి వంటిది; థియరీలు ఎన్ని చెప్పినా, వాటి విలువ వినడం లోనే వుంది. ఈ సంగతి అమరేంద్ర చాలా విపులంగా చెప్పారు. చాలా కాలం క్రిందట పన్యాల రంగనాథరావు కూడా యీ విషయంపై (రేడియో ప్రసంగాలు) సమగ్రమైన చక్కని వ్యాసం ఒకటి వ్రాశారు. ఇంతకంటె నవ్యనూతనమైన విషయాలేవీ యీ 176 పేజీల గ్రంథంలో కనబడలేదు.

వివరన అనుబంధంలో క్లుప్తంగా సమీక్షిస్తూ యిట్లా వ్రాసారు.

'........ మాట్లాడుకొనే భాష మాత్రమే వుపయోగించాలి. చిన్న వాక్యాలు, పదాలు రాయాలి, —— పేరాలుగా విడగొట్టాలి; వాక్యాలు విడి విడిగా రాయాలి——."

మొత్తం 20 వ్యాసాల్లో ఎన్నింటిలో పై సూత్రాలను పాటించారు అనే ప్రశ్న పుస్తకం పూర్తిగా చదివాక కలుగుతుంది.

ఈ వ్యాస సంపుటి ప్రచురణలో ఏషియన్ మాస్ కమ్యూనికేషన్ రిసెర్చి అండ్ యిన్‌ఫర్‌మేషన్ సెంటర్ వారి సహకారం వున్నది.

—సరోజినీ ప్రేమ్‌చంద్

* * *

అక్కినేని ఆలోచనలు - అ ఆలు
రచన: అక్కినేని నాగేశ్వరరావు.
ప్రచురణ: వంశీ కల్చరల్ అండ్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, బృందావన కాలనీ, హైదరాబాదు - 44. వెల: అమూల్యం.

చంద్ర ముఖచిత్రం గల ఈ 'అఆ'ల లోని ఆలోచనా తరంగాలకు బాపూ చంద్రలు భావయుక్తమైన బొమ్మలు సమకూర్చారు. నటజీవితం నలభై వసంతాలు, నిజ జీవితం అరవై వసంతాలు పూర్తి చేసుకొని, 1984 సెప్టెంబరు 24వ తేదిన ప్రచురించిన ఈ చిన్న పుస్తకం ఈ మధ్యనే మాకు అందింది. సహృదయులు, సద్విమర్శకులు అయిన పత్రికా రచయితలకు ఈ 'అ ఆ'లను కృతజ్ఞతతో సమర్పిస్తున్నానన్నారు 'ఎవర్‌గ్రీన్ హీరో' అక్కినేని.

'తోకలు లేని కోతి మూకల కాలంలో' 'సజ్జన స్నేహానికి దగ్గరగా ఉండే మానవుడు - దుర్జన సహవాసానికి దూరం కాలేక పోతున్నాడట' .... 'గాడిదల కాళ్లు పట్టుకోవడానికి అడ్డగాడిదలు పోటీ పడుతున్నాయట' .... మంచితనం మనిషికి మరొకరివ్వలేని మకుటమనీ, మంచితనపు మకుటం ధరించి మంచిగంధపు

సువాసనల్ని పదిమందికీ పంచిపెట్టమనీ వివేకం విజ్ఞానం వున్న శత్రువుకంటె అవివేకం అజ్ఞానం వున్న మిత్రుడు ప్రమాదకరమనీ, గొర్రెలకు కూడా బుర్రలొస్తాయి, ఉపయోగించి భరతం పడతాయనీ — అంటున్నారు పద్మ భూషణ్ అక్కినేని నాగేశ్వరరావు. వేమనసూక్తుల వంటి ఈ ఆలోచనా వీచికలు, సమకాలీన సమాజకిరణాలై అంతరంగాన్ని చివచివ లాడిస్తాయి.

— క్షీరసాగరమ్

## ఈ మధ్య అందినవి :

జీవిత రహస్యం - కవితా సంకలనం. జెవి రావు, తెలుగు సాహితి, న్యూఢిల్లీ - 27.... రు. 5-00.

నాచ్చారు పరిణయం - యక్షగానము. యన్‌బి శేషాచలామాత్యుడు. తెలుగు విద్యాలయం, రాజపాళయం, తమిళనాడు.... రు. 6-00.

కూరత్తాళ్వారు చరిత్ర – యక్షగానము. టి తిరువెంగళాచార్యుడు. తెలుగు విద్యాలయం, రాజపాళయం- తమిళనాడు.... రు. 5-00.

ఆలోకన - వార్షిక వాఙ్మయ సూచి, 1985. సంపాదకులు : జివి సుబ్రహ్మణ్యం. తెలుగు సాహితి, హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 134. .... రు. 100-00.

మండలి వెంకటకృష్ణారావు షష్ట్యబ్ది పూర్తి సంచిక .... యమ్ వికె అభినందన గ్రంథ సమితి, గాంధీ క్షేత్రం, అవనిగడ్డ - 521 123, కృష్ణాజిల్లా.... రు. 20-00.

తాత దిగిపోయిన బండి. .... ! - తెలుగు కథల్లో గాంధీ దర్శనం. సంపాదకులు : మధురాంతకం రాజారామ్ - రు. 25-00 ; తెలుగు తేజము - మండలి వెంకటకృష్ణారావు రు. 12-00 ; నా రాట్నచక్రం - అనుభవాలూ, జ్ఞాపకాలూ. తల్లాప్రగడ ప్రకాశరాయుడు.... రు.20-00.... ఈ మూడు పుస్తకాలు : గాంధేయ సమాజసేవా సంస్థ, గాంధీక్షేత్రం అవనిగడ్డ - 521 123, కృష్ణాజిల్లా.

అందుకున్న పుస్తకాలన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

---

భవిష్యత్తు ఏమి కానున్నదో అని భయపడేవారు ఈ లోకంలోని పరమ దుర్బలులు. — బెట్రాండ్ రసెల్.

* * *

మాట్లాడు తున్నప్పుడు అతను మధ్య మధ్య వూరుకుంటూ వుండేవాడే, అప్పుడు చాలా హాయిగా వుండేది. —సిడ్నీ స్మిత్

* * *

గొప్పగా వుండటం గొప్పదే. కాని దయ కలిగి, వుండటం యింకా గొప్పది. —విల్ రోజర్స్

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!

# త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి






త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001.

చూడలేని

# పు

డా॥ బెజవాడ గోపాలరెడ్డి

దేహములో ముఖ్యభాగమైనా, వీపును మనము చూడలేము. దేహ దుర్గమునకు కుడ్యము, ప్రాకారము వంటిది. ముఖానికి శిరస్సుకు ఇచ్చిన ప్రాముఖ్యము వీపుకు మనము యియ్యలేదు. సాహిత్యములోను వీపు వర్ణన ఎవరూ చేయలేదేమో! కటి ప్రదేశమని, నితంభములని సూచిస్తారు. వీపును ఎవరు పేర్కొనరు. దీనిని సంస్కృతములో ఏమంటారో కూడా నాకు తెలియదు. మౌనంగా ప్రధానమైన పాత్రనే నిర్వహిస్తుంది.

యుద్ధ భూమిలో వీపును చూపుట పలాయన సూచన. గుండె మీద గుండు దెబ్బ తిన్నవాడు సాహస వంతుడు. వీపు మీద దెబ్బ తిన్నవాడు పిరికిపంద. వీపు పరాఙ్ముఖత్వమును సూచించేది. ఉదాసీన భావాన్ని చూపేది. కార్యరంగములో రొమ్మును యిచ్చి పని చేయువాడే కార్యశూరుడు. వీపుతో ఏ పనీ కాదు. వీపుతో ముందుకు నడవలేము, చూడలేము. చిత్రమైన పాత్ర వీపుది. ఇప్పుడిప్పుడే వీపును చూపే జ్యాకెట్లు వస్తున్నాయి. వీపు అందం కూడా చూడమని పిలుస్తున్నాయి. సభలో, క్లాసులో వెనుకనున్న వారికి వీపులే కనబడతాయి. వేదిక మీద వారికి ముఖాల పండగలే. కొందరికి జడలో పువ్వులు తురిమిన వారి వెనుక కూర్చోవాలని యిష్టం. పువ్వులు చూడటానికి, కొద్దిగ వచ్చే వాసన పీల్చడానికి. వీపులు చూడాలని కాదు. దేహ సాహిత్యములో వీపు ఉపేక్షిత. అన్ని ఉపేక్షలను సహిస్తూ, తన పనిని తాను చప్పుడు లేకుండా, ప్రకటనలు చేయకుండా చేసుకొంటూ పోతుంది; కారానాలో పనిచేసే కూలీ మాదిరి.

దెబ్బలు తినేదీ వీపు. గుర్రం వీపు మీదనే కంజీ దెబ్బలు, ఎద్దు వీపు మీదే దెబ్బలు, కనబడకుండా కొట్టాలంటే వీపు మీద కొట్టాలి బరువులు మోసేది వీపులే. జీను వేసేది గుర్రం వీపు మీదే. అంబారీ కట్టేది ఏనుగు వీపు మీద. హుషారు కలిగించేది వీపును తట్టే మనుష్యులలో కన్నా, జంతువులలో వీపుకు ఎక్కువ ప్రాధాన్యం, పక్షులలో వీపులు అంటే వుంటాయి రెక్కలు. ఉపేక్షితయైన వీపును పలుకరించి, అసలు విషయానికి వసాను.

సంసార సాగరానికి వీపు చూపితే తప్ప, నీ సాధన కుదురదు. యోగము సిద్ధించదు. నీ లక్ష్యాన్ని చేరుకో లేవు. జ్ఞానోదయము కలగా లంటే, విరుయలంపటలకు వీపు చూపు కతప్పదు. వీపును త్రిప్పట మంటే పెడ మొగము పెట్టుట, కొంత ఔదా సీన్యా భావాన్ని పెంచుకొనుట, కోరిక. తొడిమల గిల్లి వేయుట. అభిమానాలు, అనురాగాలను కృశింప చేయుట, ఆత్మార్పణ చేయుట, లక్ష్యసాధనకై సాష్టాంగ ప్రణామము కావించుట, శరణమడుగుట, అణుకువను చూపించుట, ఆ సంచిలోని సామానులే, ఆ పొదిలోని అంబులే.

యోగులు సంసారమునకు వీపులు త్రిప్పి, అడవులకు ఏగుట, పర్వత గుహలకు చనుట మనకు విదితమే. అరణ్యాపర్వము, అరణ్యాకాండ, సుఖ లాలసలకు వీపుల త్రిప్పుటే గదా! దేశ స్వాతంత్ర్యమునకై శిక్షింపబడి జైలు కేగుట, బంధుమిత్రుల స్నేహ సంపద నుండి తొలగించుటయే కదా ఆనంద భోగాల నుండి వంచితులగుటయే గదా! వీడ్కోలు నిచ్చి బరువైన వీపులతోనే తిరిగివస్తాము.

ప్రపంచ కోలాహలముల నుండి వీపును త్రిప్పి లక్ష్య సిద్ధికై ముందు చూస్తూ, ముందుకు సాగు, నీ పిలుపు విని ఎవరు అనుసరించకపోతే, నీవు ఏకాకి గానే చను. నీ జండాను దింపకు, నీ కాగడాను నెత్తురు చమురుతోను వెలిగించుకో. నీ దేహాన్ని నీ ప్రాణాన్ని దీపపు వత్తిగా పేనుకో. నెమ్మదిగా నీ వీపును చూస్తూ, ప్రజలే అనుసరించి వస్తారు.

వీపు చూపినవారే జ్ఞాన సిద్ధులు, యోగీశ్వరులు, కార్యశూరులవుతారు. వీపుల పిలుపులు విని ప్రజలు మూగుతారు. సంకోచించకు, పద, వీపు త్రిప్పు.

తీరానికి వీపు త్రిప్పి, అలలు కడలిలో నీవు పడవను తేల్చుకో, తెడ్డు వేసుకొంటు, నీలది గంతముల వైపు చను, దారులు, డొంకలు లేని ఆ రాజ్యానికి నీవే ప్రభువువు.

28-3-88 - నేను ముఖ్యమంత్రియైన దినము, 56లోక ర్ణూలులో.

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్లో 'జగతి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా చేరమని! రెండు సంవత్సరాలకి, అంటే 24 సంచికలకు, నలభైయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B.2922 - Madras - 600 004




## 1988 మార్చి 27

"సినిమావాళ్లు నాతో మంచివాళ్ళే. ఎంత మంచివాళ్లంటే, మన రైలు టికెట్ వారే కొంటారు: స్టేషన్‌కొచ్చి తమ కార్లో హోటల్‌కి తీసుకువెళ్ళి, బస ఏర్పాటు చేస్తారు. మద్రాసులో కాలు కింద పెట్టనివ్వరు; ఎక్కడి కెళ్లినా తమ కారులో తీసుకువెళ్తారు, మన భోజన సదుపాయం, కాఫీ ఫల హారాలు ఎంతో శ్రద్ధగా కనుక్కుం టారు. రిటర్న్ జర్నీ టికెట్ వారే బుక్ చేస్తారు – స్టేషన్‌కొచ్చి రైలెక్కిస్తారు. సినిమావాళ్లు ఎంత గొప్పగా మర్యాద చేస్తారో చెప్పలేను. మనని ఏమాత్రం శ్రమపడ నివ్వరు. ఆ మర్యాద యింతా అంతా కాదు. మనం కష్టపడటం వారికి యిష్టం వుండదు గనక ఆఖరికి మన డైలాగులు కూడా మనని రాయ నివ్వరు' – అన్నారు రావి శాస్త్రిగారు వెనకొకసారి... అలాంటిదే మరొక జోక్. ఒక పెద్దమనిషి ఒక గాడిదకు 'యస్' అనడం నేర్పాడట. ఎవరైనా ఆ గాడిదచేత 'యస్' గాక మరొక మాట అనిపించగలిగితే, వెయ్యిన్నూట పదహార్లు బహుమానం ఇస్తాననీ. అయితే ఈ పోటీలో పాల్గొనేందుకు పదిరూపాయిలు ప్రవేశ రుసుము చెల్లించవలసి వుంటుందనీ షరతు పెట్టాడట. తమ అదృష్టం పరీక్షించు కొనేందుకు ఎందరెందరో పోటీలో పాల్గొన్న కారణంగా ఆ పెద్దమనిషి రెండు మేడలు కట్టించ గలిగాడు. శ్రీకాకుళం నుంచి నెల్లూరుదాకా దిగ్వి జయ యాత్ర చేశాడు. నెల్లూరులో ఒక పోటీదారు ఆ గాడిద చెవిలో ఒక మాట చెప్పగా 'నో, నో' అంటూ రివ్వున పరిగెత్తిందట అది. ఆ పెద్ద మనిషి వెయ్యిన్నూట పదహార్లు పోటీ దారుకి చెల్లిస్తూ, 'బాబూ ఇంతదాకా అన్నిచోట్లా జయమే తప్ప అపజయ మంటూ ఎరగను. మీరు ఆ గాడిద చెవిలో చెప్పిన రహస్యమేమిటో తెలిపి నన్ను కృతార్థుని చేయండి' అని వేడు కొన్నాడట. 'ఆ ఏమీలేదు – మద్రాసు వెళ్ళి తెలుగు సినిమా డైలాగులు రాస్తావా? – అని అడిగాను. 'నో, నో' అంటూ దౌడుతీసింది' – అన్నాడు విజయగర్వంతో పోటీదారు..." అంటూ సభికులని నవ్వులలో ముంచె త్తారు, తెలుగు విద్యార్థి సాహితీసమితి వారు, పొట్టిశ్రీరాములు హాలులో జరిపిన ఫంక్షన్‌కి అధ్యక్షత వహించిన

సుప్రసిద్ధ దర్శకులు, 'అహ నా పెళ్ళంట' జరిపించి, 'వివాహభోజనంబు'కి సిద్ధం గమ్మంటున్న జంధ్యాల. ఇరవైనాలుగు సార్లు వన్స్‌మోర్‌లు రంగస్థలం మీద పాడిన నటుని గురించి చెప్పారు. భమిడిపాటి రాధాకృష్ణ. ముఖ్య అతిథిగా విచ్చేసిన హరిప్రసాద్ రెడ్డి, తెలుగువారి కార్యక్రమాలకి చాలా తక్కువ సంఖ్యలో వస్తున్నారనీ తాము తీయబోయే చిత్రానికి జంధ్యాలే దర్శకులనీ అన్నారు. శ్యామ్‌సుందర్ పార్టీ వారి మిమిక్రీ, లలిత సంగీతపోటీ ఈ నాటి సాంస్కృతిక విశేషాలు. సెక్రటరీ కనకదుర్గ, ప్రెసిడెంట్ అనూరాధ ఈ ఉత్సవాన్ని ఎంతో సమర్ధవంతంగా నిర్వహించారు.

## 1988 ఏప్రిల్ 06

సవేరా మినీ హాలులో, 'ఏ ఐ ఐ య స్' ప్రాంతీయ డైరక్టరు పప్పు వేణు గోపాలరావు పార్టీ - ఢిల్లీ నుంచి వచ్చిన ప్రధాన డైరక్టరు గౌరవార్ధం. డి ఆంజనేయులు, నేనూ తప్ప మిగతా అందరూ అకాడమిషియనులు (ఉన్నత విద్యావేత్తలు) - 'ఏ ఐ ఐ య స్' స్పాన్సరింగ్‌లో వచ్చిన కొందరు విద్యార్థినీ విద్యార్థులు కూడా వున్నారనుకోండి - మొత్తం గాదరింగ్ పాతిక ముప్ఫయి లోపు. ఇలాటి సందర్భాలలో పరస్పర పరిచయాలయాక, ఎవరికి వారు తమకు తెలిసిన వారి పక్కనున్న కుర్చీ చూసుకోవడం సహజం. న్యూ ఇరా పబ్లిషింగ్ శ్రీనివాసన్‌తో దేశ భాషా ప్రచురణలు, ఇంగ్లీషు భాషా ప్రచురణలు గురించి కాసేపు మాట్లాడాను. ఇంతలో 'ఐఐటి' రంగరాజన్ వచ్చి మరొక ప్రక్కనున్న కుర్చీలో కూచున్నారు. ఒకరినొకరు పరిచయం చేసుకున్నాక, 'మీరు.... మాలతీ చందూర్....' అంటూ వాక్యం మధ్యలో ఆపారాయన. 'అవును - ద్వితీయార్ధాన్ని' - అన్నాను నవ్వుతూ. 'చందూర్' అని పేరు చెప్పగానే 'మాలతీచందూర్ ?' అంటూ ఎదుట వారు ప్రశ్నార్ధకంగా నా ముఖంలోకి చూడటం, ముప్ఫయ్యేళ్లుగా అలవాటై పోయింది. రంగరాజన్, ఆస్ట్రేలియా వెళ్లడానికి పూర్వం అయిదారేళ్లు ఆంధ్రా యూనివర్సిటీలో (వైజాగ్) ఉన్నారట - అరవైలలో. ఆరు నెలలలో తెలుగు నేర్చుకున్నారట - 'ప్రభ'లో జవాబులు చదివేవారట. జయకాంతన్, సుజాత, శివశంకరి వంటి వారి తమిళ రచనలు మాలతీచందూర్ తెలుగులోకి తెచ్చారని కూడా ఆయనకి తెలుసు. ఆయన వుండేది ఆళ్వారుపేట - మేము వుండేది మైలాపూరు.... డ్రింకూ, సాఫ్ట్ డ్రింకూ, సూపూ, డిన్నరూ, మృదంగం విద్యార్థి (అమెరికన్) కబుర్లూ, ఆ విద్యలోని మెళకువలూ, ఇండియా గురించి గత ఏభై ఏళ్లలో మూడు వేలకు పైగా గ్రంథాలు అమెరికాలో వెలువడటం యిత్యాది విషయాలతో రెండు గంటలు యిట్టే దొర్లిపోయాయి. డా॥ పప్పు వేణుగోపాలరావు 'ఎ ఐ ఐ యస్' ప్రాంతీయ కార్యాలయానికి డైరక్టరు అన్నాను; ఇంతకీ ఆ 'ఎ ఐ ఐ య స్' అంటే ఏమిటి? అనే ప్రశ్న మీకు కలగడం సహజం. ఎ ఐ ఐ యస్ అనగా అమెరికన్

ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్ (American Institute of Indian Studies). ఇండియాలో దీని హెడ్ క్వార్టర్స్ న్యూఢిల్లీలో - ప్రధానాధికారి ప్రదీప్ మహేందరిట్టా. కలకత్తా, మద్రాసు, పూనెలలో ప్రాంతీయ కార్యాలయాలు వున్నాయి. రిసెర్చి సెంటర్స్ వారణాశిలోను, న్యూఢిల్లీలోను వున్నాయి. వారణాశిలో వున్నది సెంటర్ ఫర్ ఆర్ట్ అండ్ ఆర్కియాలజీ (Centre For Art & Archelogy). న్యూఢిల్లీలో ది ఆర్కయివ్స్ అండ్ రిసెర్చి సెంటర్ ఫర్ ఎత్నో మ్యూజికాలజీ (Archives and Research Centre for Ethnomusicology) వారణాశి కేంద్రంలో 77 వేల ఫొటోలు, 20వేల పుస్తకాలువున్నాయి. మన దేవాలయ వాస్తు శిల్పం గురించి ఎనిమిది సంపుటాల ఎన్‌సైక్లోపెడియా ఈ సంస్థ తలపెట్టింది; అందులో మూడు సంపుటాలు వెలువడ్డాయి; మరొక అయిదు తయారీలో ఉన్నాయి. ....రాజకీయాలతో ఎటువంటి సంబంధమూలేని ఈ సాంస్కృతిక పరిశోధనా సంస్థను, పెన్సిల్వేనియా యూనివర్సిటీలోని సంస్కృత భాషాధ్యాపకుడు నార్మన్ బ్రవున్ (Norman Brown) 1961లో, తన మిత్రులు మరి కొందరితో కలిసి స్థాపించారు - భారతీయ సంస్కృతిని, చరిత్రని అధ్యయనం చేయడమే ఈ సంస్థ లక్ష్యం - అధ్యయనాభిలాష గల పరిశోధకులకు ఉపకారవేతనాలు (రిసెర్చి స్కాలర్‌షిప్స్) యిచ్చి, తమ ఖర్చు మీద పంపుతుంది.



వెండి బిళ్లలూ, బంగారం కాసులు తప్ప పేపరు కరెన్సీని నమ్మేవాలే కాదొకప్పుడు. ఇప్పుడు అమెరికాలో కరెన్సీనోట్లూ బాంకు చెక్కులూకాదు, సమస్తం క్రెడిట్ కార్డు ద్వారా! విమానం టికెట్లు సైతం కార్డు చూపి కొనుక్కోవడమే!



ఈ 'ఫెలో షిప్స్‌కి' సాధారణంగా తొమ్మిదీ పన్నెండు నెలల వ్యవధి ఉంటుంది - అమెరికన్ పౌరులూ, అమెరికాలో స్థిరపడ్డ ఇండియనులూ మాత్రమే ఈ స్కాలర్‌షిప్స్‌కి అర్హులు. సాలీనా ఒక వందమంది ఈ సంస్థ 'స్పాన్సరింగ్'లో ఇండియా వస్తూంటారు; తమ ప్రొఫెసర్ నిర్ణయించిన అంశంపై, ప్రామాణిక వ్యాసానికి (థీసిస్) సమాచారం సేకరించి తమ పరిశోధనని సుదీర్ఘంగా విశదపరిచి, 'పిహెచ్‌డి' (డాక్టరేట్) పొందుతారు. పోయిన సంవత్సరం అంటే 1987 మార్చి నెల 'జగతి'లో (డైరీ), 'సారా

డిక్కీ' అనే యువతి గురించి చదివి వుంటారు. 'మధ్య తరగతిపై తమిళ సినిమా ప్రభావం' అనే అంశంపై 'పిహెచ్‌డి' చేయడానికి వచ్చిందామె. అసారా డిక్కీ ఈ 'ఎఐఐయస్' ప్రోగ్రామ్‌లోని స్కాలర్.... ఈ సంస్థ ప్రధాన కార్యాలయం షికాగాలో ఉంది. అమెరికాలోని 41 ప్రముఖ విశ్వవిద్యాలయాల నుంచి ఏభై అయిదు గురు ప్రొఫెసర్లు ఈ బోర్డ్ ఆఫ్ ట్రస్టీస్‌లో ఉన్నారు; విస్కాన్సిన్ యూనివర్సిటీకి చెందిన మన వేల్చేరు నారాయణరావు కూడా యిందులో ఒక ట్రస్టీ. ఇప్పటికి రెండువేల మంది స్కాలర్లు ఈ స్కీములో ఇండియాకు వచ్చి మన లలిత కళలను, సంగీత సాహిత్యాలను, చరిత్రను అధ్యయనం చేశారు. పోయిన సంవత్సరం ఒక అమెరికన్ విద్యార్థిని 'కాంచీపురం చీరెలు' మీద థీసిస్ చేసింది, రాజకీయ ప్రమేయం లేకుండా.. ఉన్నత విద్యా కోవిదులు ఏర్పరిచిన సాంస్కృతిక వారధి ఈ అధ్యయన సంస్థ - అమెరికన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్.

. . . . . 08

చారుహాసన్ దంపతుల కుమార్తె సౌ॥ సుహాసినికీ, ఫ్లయిట్ లెఫ్టనెంట్ ఆనందకృష్ణన్‌కీ ఈ ఉదయం తొమ్మిదిన్నరకు విజయరాణీ మహల్‌లో వేదోక్తంగా వివాహం జరిగింది. పొద్దుట ముహూర్తానికి సాయంత్రం రిసెప్షన్‌కీ మద్రాసు సినీ పరిశ్రమలోని ప్రముఖులనేకులు వచ్చి నూతన వధూవరులకు శుభాభినందనలు తెలిపారు.

. . . . . 11

"రుద్రవీణ" పలికించిన చిరంజీవి నూరవ చిత్రానికి షూటింగ్ ప్రారంభోత్సవం- ఎవియమ్ తొమ్మిదో ఫ్లోర్‌లో. సాంగ్స్ ముహూర్తం మూడు రోజుల క్రితం 'ప్రసాద్' లో జరిగింది. ఇవ్వాళ బాలచందర్ క్లాప్ యివ్వగా, రాఘవేంద్రరావు స్విచాన్ చేశారు. పరిశ్రమలోని ప్రముఖ లెందరో వచ్చి చిరంజీవికి శుభాకాంక్షలు తెలిపారు. అంజనా వారి ఈ చిత్రానికి నిర్మాత నాగేంద్రబాబు. భానుప్రియ కథానాయిక. స్క్రీన్‌ప్లే: యండమూరి; సంభాషణలు: సత్యానంద్. మురళీమోహన్, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, రంగనాథ్, బ్రహ్మానందం మున్నగువారున్నారు. మద్రాసు, కాశ్మీరు, గోవాలలో మూడు షెడ్యూల్స్‌లో, సినిమా స్కోప్‌లో నిర్మితమయే ఈ భారీ చిత్రానికి దర్శకులు కోదండరామిరెడ్డి.

. . . . . 22

పది పన్నెండు రోజుల క్రితం 'మీరు మరిమలైనగర్ వెళ్తున్నారు కదా?' అని అడిగారు రమణయ్యరాజా. అంతేకాదు, వెళ్లండని ప్రోత్సహించారు. వెంట నేతమిళనాడు కాంగ్రెస్‌కమిటీ వారికి 'గుర్తింపు కార్డు' (ప్రెస్‌పాస్) కోసం ఉత్తరం రాశాను. ఈ చిన్న పత్రిక్కి గుర్తింపు లభిస్తుందా అనే సందేహం నాకు లేకపోలేదు .... 19వ తేదీ ఉదయం ఒక లేడీ, టెలిఫోన్ చేసి, ఆ మధ్యాహ్నం 'కెన్నమెరా'లో లంచ్ ఉందనీ, మూపనార్ మాట్లాడుతున్నారనీ

తప్పకుండా రమ్మనీ, రెండు పాస్‌పోర్టు సైజు ఫొటోలు 'యక్రెడిటేషన్' కోసం పంపమనీ చెప్పారు. (ఆ కంఠం డా॥ శౌరి రాజన్ కుమార్తె అనూరాధదనీ, ఆమె ఎలక్ట్రానిక్స్ ఇంజనీరనీ, శౌరిరాజన్ దంపతులు డాక్టరులనీ, ఎందరో పేదలకు ఉచిత వైద్యం వేస్తారనీ వారి కుటుంబం యావత్తూ గాంధేయ సిద్ధాంతాలకు అంకితమై ఉన్నదనీ, ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశ సందర్భమైన ప్రెస్‌వ్యవహారాలన్నీ చూస్తున్నది. డా॥ శౌరిరాజన్ అనీ, ఆ తర్వాతగాని తెలియలేదు). 'కెన్నమెరా' లంచ్ అయాక, ఇరవై ఒకటి మధ్యాహ్నం తేనాంపేట గ్రవుండ్స్‌కి వచ్చి, ప్రెస్ కార్డు తీసుకోమన్నారు .... ఈ ఉదయం పదకొండున్నరకి ప్రెస్ కోసమని కేటాయించిన డీలక్స్ బస్సులు తేనాంపేట కాంగ్రెస్ గ్రవుండ్స్ నుంచి బయలుదేరాయి. శౌరిరాజన్ మా బస్సులోనే వచ్చారు - మరిమలైనగర్ 45 కిలోమీటర్లు. మధ్యలో టీ, బిస్కట్లూ. పన్నెండున్నరకి 'వెన్యూ' చేరుకున్నాం. ప్రెస్ ఎన్‌క్లోజర్‌లో కాసేపు ఈత చాపల మీద కూచున్నాం - ఇంకా కుర్చీలూ బల్లలూ వేయలేదు - అప్పుడే లారీలో దిగాయి. మొదటి రోజు గనక కాంటీన్ ఎటువైపు, కాఫీ, కూల్‌డ్రింక్స్ ఎక్కడ దొరుకుతాయి, మా ఎంక్లోజర్‌కి ప్రవేశ మార్గమెక్కడ ?- యిలాటివి, పత్రికలవారికని కేటాయించిన టెలిప్రింటర్ లైనులూ వారి షెడ్లూ, ఆలిండియా దూరదర్శిని



మొదటి శతం పూర్తి చేసి సుప్రీమ్ హీరోగా అభిమానుల మెప్పు పొందు తున్న చిరంజీవి

వారి ఏర్పాట్లు – ఇదంతా ముహూర్తానికి ముందు జరిగే హడావిడి ముహూర్తం రేపు ఉదయం ఎనిమిదిన్నరకి. నాగపూర్ నుంచి విమానంలో దిగి, త్రిశూలంలో ఎలక్ట్రిక్ ట్రయిన్ ఎక్కి, 'కామరాజ్‌నగర్' దాకా రాజీవ్ గాంధీ ప్రయాణం చేయడం, అక్కడ నుంచి కారులో, వర్కింగ్ కమిటీ మీటింగు జరిగే చోటికి రావడం — అదే ఈనాటి విశేషం. రాత్రి తొమ్మిది గంటలకు, వర్కింగ్ కమిటీలో చర్చించిన అంశాలు కమిటీ కార్యదర్శి ప్రెస్ వారికి 'బ్రీఫ్' చేస్తారు - అంటే వెల్లడిస్తారు. వర్కింగ్ కమిటీ మీటింగు గోప్యంగా జరుగుతుంది ; రేపు ఆలిండియా కాంగ్రెస్ కమిటీ

ముందు ఈ విషయాలు చర్చకు వచ్చి, ఆమోదింపబడతాయి. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ స్టాల్‌లో చల్లటి మంచినీళ్లు తాగి, నాలుగుగంటల వేళ వెనక్కి బయలుదేరాను.... ముప్ఫయి మూడేళ్ల క్రితం 'సత్యమూర్తి నగర్'లో అవడి కాంగ్రెసు మహాసభలు జరిగాయి. మూడు గంటలవేళ నేను మాలతి, సుబ్బారావు, శర్మగారు పరశువాకమ్ నుంచి బయలుదేరి వెళ్లాం - 'సోషలిస్టిక్ పాటరన్ ఆఫ్ సొసైటీ' తీర్మానాన్ని కామరాజ్ ప్రవేశ పెట్టగా, సభవారు ఆమోదించినది ఆ అవడి కాంగ్రెస్ మహాసభలోనే! అప్పట్లో నెహ్రూగారు; ఇప్పుడు ఆయన మనుమడు రాజీవ్ గాంధీ, కామరాజ్‌నగర్ కాంగ్రెస్ మహాసభలకు అధ్యక్షుడు. - భారత ప్రజలకు ఆశాజ్యోతి, నవయువతకు మార్గదర్శి ....

..... 23

తేనాంపేట గ్రవుండ్స్ నుంచి ఉదయం ఎనిమిది గంటలకు బయలు దేరుతున్నామని చెప్పారు డాక్టర్ శౌరి రాజన్ నిన్న! అయితే కొందరు జర్నలిస్టులు ఏడుం పావుకే వచ్చి, పతాకావిష్కరణ వేళ (ఎనిమిదిన్నర) ఉండకపోతే ఎలాగా? - అన్నారట. అందుకని, ఒక బస్సు అప్పటికే వెళ్ళి పోయింది. రెండో బస్సులో మా బాచ్ బయలుదేరాం.... తొమ్మిది గంటలకే బాగా ఎండెక్కింది - ప్రెస్ ఎన్‌క్లోజర్ నిన్న చూశాను గనక, తిన్నగా లోపలికి వెళ్లాను. ఫానులు తిరుగుతున్నాయి; లోన చల్లగా ఉంది - కొంచెం ఉక్కపోత వున్నప్పటికీ! స్కూలు బెంచీలూ, డస్కు బల్లలూ రావడం నిన్న మధ్యాహ్నమే తెలుసు. అనుకూలమైన బెంచీమీద కూచుని, పొద్దుటి సమావేశం ముగిసేదాకా అక్కడనుంచి కదలలేదు. ప్రెస్‌వారికని యిచ్చే మెటీరియల్ అందుకోవడానికి వీలుగా నాది రెండో వరస. కాంగ్రెస్ వర్ణిక, బొంబాయిలో జరిగిన శత జయంతి ఉత్సవ విశేషాల బుక్‌లెట్, కాంగ్రెస్ అధ్యక్షునిగా రాజీవ్‌గాంధీ అనాడు చేసిన ఉపన్యాసం, కామరాజ్ నగర్ సావనీర్ - యిత్యాదులు బ్రవున్ కవరులో యిచ్చారు. అయితే అవి యింకొంచెం ఆర్డర్లీగా ప్రెస్ ఎన్‌క్లోజరులోని అందరికీ అందజేసివుంటే బావుండేది. నాకైతే వచ్చిందిగాని, చాలామంది జర్నలిస్ట్ సోదరులకి లభించలేదు. ఆ తర్వాత యివ్వవచ్చు, యివ్వక పోవచ్చు - అది వేరే విషయం ....పదిన్నరకి 'వందే మాతరం' పాడుతూండగా, రాజీవ్ గాంధీ వేదికమీదకి వచ్చారు. ఆలిండియా కాంగ్రెస్ కమిటీ ప్రధాన కార్యదర్శి గులామ్ నాబీ అజాద్ సంతాప తీర్మానాలు ప్రవేశ పెట్టారు. ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్, జగజీవన్‌రామ్, యమ్‌జి రామచంద్రన్ - వీరు ముగ్గురూ తర్వాత ఆయా రాష్ట్రాలలో దివంగతులైన 379 కాంగ్రెస్ ప్రముఖుల పేర్లు, రాష్ట్రాల ఆల్ఫబెటికల్ ఆర్డర్‌లో చదివారు. వేదిక మీద ఆశీనులై వున్న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు, సంతాప సూచకంగా నాలుగు సార్లు లేచి

నిలబడ్డారు .... ప్రధాన కార్యదర్శి అజాద్ ప్రవేశబెట్టిన సంతాప తీర్మా నానంతరం, ఆహ్వాన సంఘాధ్యక్షులు మూపనార్ స్వాగతం తెలిపారు."103 సంవత్సరాల జాతీయ కాంగ్రెస్, భారత ప్రజల చరిత్రకు, స్వాతంత్ర్య పోరా టానికీ ప్రతిరూపం. కాంగ్రెస్ సంస్థ జన్మించిన, - మూడు, పది, పథ్నా లుగు, పంథొమ్మిది, నలభై ఎనిమిది - ఈ సమావేశాలు మద్రాసులో జరిగాయి. 1955 నాటి ఆవడి కాంగ్రెస్ జరిగి ముప్ఫయిమూడేళ్లు అయింది; 1961 లో మధురలో జరిగింది .... 103 సంవత్సరాల క్రితం బొంబాయిలో జరిగిన మొట్టమొదటి కాంగ్రెస్‌లో 72 ప్రతినిధులు పాల్గొన్నారు. మొట్ట మొదటితీర్మానాన్ని ప్రవేశబెట్టినఘనత జి. సుబ్రహ్మణ్య అయ్యర్ ది. ఆయ నతో బాటు మొట్టమొదటి బొంబాయి సభకు వెళ్లిన ప్రముఖులలో రంగయ్యా నాయుడు, రఘునాధరావు, అనంతా చార్యులు, సభాపతి మొదలియార్, నరసింహులు నాయుడు, విజయ రాఘ వాచారీ ఉన్నారు. మద్రాసులో జరి గిన మూడవ కాంగ్రెస్‌కి 607 ప్రతి నిధులు హాజరయారు - బద్రుద్దీన్ త్యాబ్జీ అధ్యక్షులు .... 1878లో వేదా చలంలో జన్మించి, మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో ప్రొఫెసరుగా, ఇంగ్లీషు, సంస్కృతం, తమిళ భాషల్లో అనన్య సామాన్యమైన పాండిత్యం సంపా యించి, తమిళ సుడికారానికి నవజీవ మిచ్చి, సుబ్రహ్మణ్య భారతి, నామక్కళ్ రామలింగ పిళ్లై, దేశికవినాయగమ్ పిళ్లై,



పశువులు, పందులు, పక్షులు సమస్త జీవరాసీ, తమకెంత ఆహారం కావాలో అంతే తింటాయి - మనుషుల్లా కాదు; కనిపించింది కదా అని తినవు. పక్షి జాతుల్లో కొన్ని, తమ బరువెంతో అందులో సగం ఆహార తినగలుగు తాయి.

ముందుగువారికి పథగామియై, జాతీయ పోరాటంలోను, సంఘ సంస్కరణోద్య మంలోను పాల్గొన్న మరైమలై అడి గాళ్ పేరిట ఈ ఊరు రూపుదిద్దుకుంది: మనకీనాడు ప్రధాన శతృవు ప్రాం తీయవాదం. ఒక ఆదర్శమూ, ఒక విధాన న్యాయమూ, ఒక కార్యక్రమా వళీ అంటూ లేని పార్టీలు, సంకుచి తత్వాన్ని ప్రోది చేస్తున్నాయి. ఈ చీకట్లు తొలగక మానవు: మహాత్ముడు చూపిన అహింసాపథాన్ని, నెహ్రూ చూపిన సోషలిస్ట్ లక్ష్యాన్ని, ఇందిరా గాంధీ చూపిన ప్రగతిశీల సామాజిక

న్యాయాన్ని ఈ ప్రజానీకం విస్మరించదు - చైతన్యవంతమగు రాజీవ్‌గాంధీ నాయకత్వంపై అపారమగు విశ్వాసం ఉంది మన ప్రజలకు" - అన్నారు మూపనార్,తనస్వాగత వచనంలో....

"దీనులను, పేదలను ఆదుకోవడమే కాంగ్రెస్ సంస్థ ప్రధానధ్యేయం అది నుంచీ! భారత ప్రజలలోని చిత్తశుద్ధికీ, సంకల్పశక్తికీ బాహ్యరూపమే మన జాతీయ కాంగ్రెస్.... ఆహార పదార్థాల విషయంలో స్వయం సమృద్ధి సాధించాము. అస్సామ్, మిజోరామ్‌లు జాతీయ వాహినిలో తమకూ సముచిత పాత్ర ఉందని మనసా అంగీకరించారు.... పంజాబ్ విషయంయింకా తెమలలేదు. తాము కుదుర్చుకున్న ఒప్పందానికి వారు కట్టుబడి వుండకపోవటమూ, పాకిస్థాన్ ప్రమేయమూ అందుకు కారణాలు. పోతే, శ్రీలంక విషయంలో కొన్ని ప్రతిపక్షాల ధోరణి ఎంతో అనుచితంగా ఉంటోంది. మన శాంతి రక్షణసేన అక్కడ ఒక చేతితోటే పోరాడవలసి వస్తోంది - అది ఎంత క్లిష్టతరమో సోల్జర్లకి మాత్రమే తెలుసు. తమ కర్తవ్య నిర్వహణలో పరాయినేలపై ప్రాణత్యాగం చేసిన వీరులవి. భారతజాతి మర్చిపోదు. అన్యుల హస్తగతం గాకుండా, మన రక్షణ కోసమే శ్రీలంక విషయంలో మనం కల్పించుకోవలసి వచ్చిందనే సంగతి చాలామంది మర్చిపోతున్నారు. ఆయుధ విసర్జన చేసినమీదట తప్ప, టైగర్లతో సంప్రదింపులకు అవకాశం లేదు.... సమకాలీన వాస్తవికతను కాంగ్రెస్ ఏనాడూ తోసిపుచ్చదు. మన ప్లానింగ్‌లో కొన్ని లోపాలు లేకపోలేదు. ఈ ప్లానింగ్ పై నుంచి కిందకిగాక, నాలుగువందల జిల్లాల్లోనూ జిల్లాస్థాయిలో జరగాలి. డెమోక్రసీ ప్రజల మధ్యనుంచి జీవం పోసుకోవాలి. ఇక పంటల విషయంలో కూడా మొత్తం దేశాన్ని 'అగ్రో - క్లయిమేటిక్ జోన్స్' గా విభజించవలసి ఉంది..... అహింసాయుధంతో గాంధీజీ స్వాతంత్ర్యప్రదాతకాగా, 'డెమొక్రసీ' అనే మాటకు జీవం పోశారు జవహర్‌లాల్ నెహ్రూ. సామాన్యుల కడగళ్లకు స్పందిస్తూ దేశ సమైక్యతా సమగ్రతల కోసం ప్రాణాలర్పించారు ఇందిరాగాంధీ..... మనిషికిగాని, దేశానికిగాని వ్యక్తిత్వమనగా పుష్పంలా వికసించి పరిమళించడం. అటువంటి ప్రగతి మార్గాన మనదేశం పయనించాలనిమీ అందరితోబాటునా ఆకాంక్ష"- అన్నారు కాంగ్రెస్ అధ్యక్షులు, భారత ప్రధాని, ఎనభైకోట్ల ప్రజల ఆశాదీపం అయిన రాజీవ్‌గాంధీ..... 'ఉదయం' యాదగిరితో బాటు, దాసరి పద్మ గారి ధర్మమా అని ఒంటి గంటంపావుకి యింటికొచ్చాను. నిన్న అనిపించలేదు గాని యివ్వాళ కారుతీసుకెళ్లి వుంటే బావుండేదనిపించింది. దాసరి పద్మ కనిపించారు గనకగాని లేకపోతే ఆ మండుటెండలో ఎలా బయటపడటం? నా పక్కన కూచున్న లేడీ జర్నలిస్ట్ (ఆమె పతాక వందనానికి వచ్చిందట - అంటే, ఉదయం ఏడు గంటలకి యింట్లో బయలుదేరి వుండాలి)

గుక్కెడు మంచినీళ్లు దొరక్క, దప్పికతో బాధపడింది..... ప్రెస్‌వారికి మాత్రమే రాసుకునేందుకు వీలుగా బల్లలూ కుర్చీలూ! మిగతావాళ్లందరూ నేలమీద చతికిలబడి కూచోవడమే - పార్లమెంటు సభ్యులు, కామరాజ్‌నగర్ సభకు విచ్చేసిన వివిధ రాష్ట్రాల ప్రతినిధులు, మిగతా పెద్దలు, వేదిక మీద ఆశీనులై వున్న వర్కింగ్ కమిటీ సభ్యులు, మంత్రులు, ప్రధానితో సహా. ఇక సామాన్య అహ్వానితులూ, ప్రత్యేక అహ్వానితులూ అందరూ అంతే! జోళ్లు పక్కని పెట్టుకు కూచోవడం, షూజ్ అయితే యిబ్బంది పడుతూ కూచోవడం! కాంగ్రెస్ మహాసభలంటే యిలాగే జరుగుతాయి, యిలాగే కూచోవాలి - అని చెప్పాడు ఏడెనిమిది సభలకు వెళ్లిన ఒక జర్నలిస్ట్ సోదరుడు..... గాంధీగారి కాలంలో, ఆయన మాట కాదనలేక, అలా కూచున్నారంటే, అర్థం ఉంది. అప్పట్లో యిన్ని లవుడ్ స్పీకర్లు, రేడియో, టెలివిజన్, క్లోజ్‌డ్ సర్క్యూట్, టెలీ కమ్యూనికేషన్, ఫేసిమలె న్యూస్ పేపరు, గ్రామాలలో విద్యుచ్ఛక్తి, ఎయిర్ కండీషనింగ్, జెట్‌ఫ్లయిట్ యిత్యాదులు వున్నాయా? విజ్ఞానభవన్, టాల్కోటారా వంటి వాటికి అలవాటుపడి, 21వ శతాబ్దికి ప్రజలను సంసిద్ధం గమ్మనే ఈ కాంగ్రెస్ పెద్దలు, ఎందుకని అంత వుదుకుష్టంగా కూచుని ఈ సమావేశాలు జరుపుతారో, మనకు అర్థం కాదు..... అలాగే సరుకులు తెచ్చే



మద్రాసు నుంచి వెలువడుతున్న 'ఆంధ్రప్రభ' అయిదవ ఎడిషన్‌కు (మిగతా నాలుగు : విజయవాడ, హైదరాబాదు, బెంగుళూరు, విజయనగరం) ప్రారంభోత్సవం గావించిన పెద్దలు యల్వి ప్రసాద్

లారీలమీద మనుషుల్ని ఎక్కించుకు తీసుకురావడం (మా ప్రెస్ బస్సు మరిమలై చేరుకొనే లోపల అయిదారు లారీలు అటువంటివి కనిపించాయి). కేంద్రాధికారంలో ఉన్న పార్టీకి చెందిన కార్యకర్తలు, యిటువంటి చట్టవిరుద్ధమైన చర్యను అవలంబించి వుండకూడదు. ఇవి స్వల్ప విషయాల్లా కనిపించవచ్చు. కాని విత్తనాలని బట్టే చెట్లూమహావృక్షాలూను ....బారిస్టరో, కలెక్టరో కాగల అర్హత ఉండి, అటు వైపు మొగ్గక, స్వాతంత్ర్య పోరాటానికి జర్నలిజమ్‌కీ అట్టే తేడా లేని రోజులలో బిజిహార్నిమాన్ ('బొంబాయి

క్రానికల్') వద్ద అప్రంటిస్‌గా చేరి, గాంధీజీని ఇంటర్వ్యూ చేయడానికి బార్డోలి వెళ్లిన డియఫ్ కరాకా అంటాడు : "ఆయన సమక్షంలో మనం నమ్మలేని శాంతి ఏదో చుట్టూ పరచుకుంటుంది. ఆయన వొంటి మెరుపులోని గులాబివన్నె, అప్పుడే జన్మించిన శిశువుని గుర్తు చేస్తుంది..... నీకని కేటాయించినది ఇరవై నిముషాలు మాత్రమే - అన్నారాయన. ఎలా ప్రారంభించాలో నాకు తోచడం లేదు. 'మీ కుటుంబం నాకు తెలుసు - మీ ముత్తాతగారు, అమ్మమ్మగారి తండ్రి పెద్ద సోషల్ వర్కర్. ఆయన పేరిట శిలావిగ్రహం స్థాపించారు – రాతి బొమ్మలలో ఏముందిగాని, వ్యక్తిగా సంస్కరణవాదిగా ఆయన ఎంతో ఉదాత్తులూ, గొప్పవారూను'- అంటూ నాకు తెలియని ప్రపంచంలోకి నన్ను పట్టుకెళ్లారాయన. 'అలవాటు లేక పోవడంవల్ల నేలమీద కూచోవడం నీకు యిబ్బందిగా ఉంది కాని, ఈ ఆశ్రమంలో కుర్చీలు లేవు' - అన్నారాయన. ఇరవై నిముషాలు ఇట్టే గడిచిపోయాయి. బొంబాయి వచ్చాక మా ఎడిటర్‌గారు, 'ఏమేమి ప్రశ్నలు వేశావు' - అని అడిగారు. నేనేమీ ప్రశ్నలు వేయలేదు - ఆయన చెప్పినది విన్నాను - ఆ కాంతి వెల్లువలో కరిగిపోయాను - అన్నాను." .... బహుశా, ఆ పవిత్రమూర్తి స్మృతి గౌరవ చిహ్నంగానే, కాంగ్రెస్ మహాసభలలో ఎంతటివారూ నేలమీద కూర్చోవడమే తప్ప కుర్చీలు వాడరేమో..... 'నా వంతు కన్నీళ్లు' ( 'I've Shed My Tears' - DF Karaka) అనే పుస్తకంలో డియఫ్ కరకా, తను మొదటిసారిగా చూసిన త్రిపురి కాంగ్రెస్(1939) గురించి ఈవిధంగా చెబుతాడు : "జబల్పూర్‌లో ఒక గవర్నమెంటాఫీసరుయింట బసచేస్తూ, ఒక జమిందారు యిచ్చిన కారులో, రోజూ ఉదయం బ్రేక్‌ఫాస్ట్ అయాక, మట్టిరోడ్డుమీద త్రిపురి వచ్చేవాడిని, ఆ దుమ్మూ ధూళీ చెప్పతరం కాదు ; ఒక గంట గడిచేసరికి ఆ ధూళితెర ముఖాన్ని ముక్కూ చెవుల్నీ కప్పేసేది.... ఈ సెషన్స్‌కి గాంధీజీ రాలేదు ; కాని, ఆయన కోసమని కేటాయించిన కుటీరాన్ని వేలసంఖ్యలో గ్రామీణులు దర్శించేవారు ....ఇతర జర్నలిస్టులు నన్ను సరోజినీ నాయుడు పరిచారకునిగా (Pageboy) భావించేవారు. మతబోధ, నాటకీయత మిళితమై ఉండేవి ఆ కవయిత్రి ఉపన్యాస ధోరణిలో. ఎంతటి వారినీ ఆమె వేళాకోళం పట్టించేది - కాని, ఆమెది వెన్నపూసలాటి మనసు అవటంవల్ల ఎవరూ నొచ్చుకొనేవారు కాదు. నర్మదా నది వొడ్డునున్న ఈ త్రిపురికి సుమారు రెండు లక్షలమంది కాలి నడకని, రెండెడ్ల బళ్లమీద వచ్చారు..... కాంగ్రెస్ నాయకులందరిలోను నన్ను అమితంగా ఆకర్షించిన వ్యక్తి గఫార్ ఖాన్ ; ఆ తర్వాత తన విద్యా వినయ సౌశీల్యాలతో మౌలానా అజాద్. హారోలోను, కేంబ్రిడ్జిలోను చదువుకు, సిడ్నీ అండ్ బెట్రిస్ వెబ్ దంపతుల వల్ల

పడై, హృదయ ధర్మంలో ఫేబియన్ అయిన జవహర్‌లాల్ నెహ్రూ అతిసంపన్నుడు - చక్కటి మాటకారి. రాజకీయలక్ష్యం కోసం రాట్నచక్రం చేబట్టాడాయన - ఎన్నికష్టాలు పడ్డప్పటికీ చెరగని చిరునవ్వు అయన ఘన సంపద.... నిరాడంబరుడూ అనుపమ మేధావి రా జ గో పా లా చా రి. ప్రత్యర్థి వాదనలోని లొసుగులుచూపి, ఏది క్రమబద్ధమో నిర్ద్వంద్వంగా విశదీకరించగల నిశితమైన మేధస్సు ఆయనది. రాజకీయాలలో సముచిత తర్కానికి స్థానమిచ్చిన కారణంగానే ఆయన నష్టపోవలసి వచ్చింది. వల్లభాయి పటేల్ కార్యవాది, కార్యశూరుడూను. ఇక, సుభాస్ చంద్రబోస్ అంటారూ, గొప్ప అర్గనైజరేగాని ఆయన అంతరాంతరంలో ఆదర్శబలిమి లేదు. బ్రిటిష్‌వారిని వెళ్లగొట్టడమే అయన ప్రధాన లక్ష్యం - అదే 'స్వాతంత్ర్యం' (Freedom) అని ఆయన అభిప్రాయం: స్వయం సమృద్ధితో 'గ్రామ స్వరాజ్యం' ఏర్పడటమే 'స్వాతంత్ర్యం' అని బాపూజీ ఉద్దేశ్యం. పార్లమెంటరీ డెమొక్రసీ స్వదేశంలోను, అంతర్జాతీయ సోషలిజమ్ విదేశ వ్యవహారాలలోను ఏర్పడటమే 'స్వాతంత్ర్యం' అని జవహర్లాల్ నెహ్రూ నమ్మకం,... ఆకాశాన చుక్కలు మొలిచాక, ఆ సువిశాలమైన ఆరుబయట, కొన్ని వేల గొంతుకలు ముక్త కంఠంతో 'వందే మాతరం' పాడుతున్నప్పుడు, ఐక్యగాన సుధలో నావొళ్లు జలదరించింది; నా దేశప్రజల ఆత్మగౌరవం నన్ను పరవశత్వంలో ముంచింది"— నలభై రెండేళ్ల క్రితం డియఫ్ కరాకా వ్రాసిన మాటలవి. కరాకా గాని అయన పేర్కొన్న ఆ మహనీయులుగాని ఈనాడు లేరు. అయితే వారి ఆత్మతేజం. తరతరాల ప్రజలకు, కాంగ్రెస్ సంస్థ ద్వారా ఉద్దీపన కలిగించడం మాత్రం తథ్యం. వందేమాతరం - సుఫలాం శుభలాం సస్యశ్యామలాం – వందే మాతరమ్.

## 24

వేటూరి ప్రభాకర శాస్త్రి (1888 - 1950) రెండేళ్ల పాటు మద్రాసు కెల్లెట్ హైస్కూలులో తెలుగు పండితునిగా వుండి, ఆ తర్వాత ముప్పయ్యేళ్లు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పనిచేశారు; బసవ పురాణము, ఉద్భటారాధ్య చరిత్ర, హరవిలాసము, మనుచరిత్రము, క్రీడాభిరామము, రంగనాధ రామాయణము మున్నగునవి పరిష్కరించారు; శివకవుల రచనలపై అపారమైన పరిశోధన గావించారు. ఆ తర్వాత తిరుపతికి తమ నివాసం మార్చి, ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌లో జాయినై, తాళ్లపాక కవుల కృతులు వెలికితీసి, పదకవితా పితామహుడైన అన్నమయ్యా వైష్ణవభక్తి శృంగారాలని లోకానికి వెల్లడించారు. రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, వేటూరిప్రభాకర శాస్త్రి అన్నమాచార్యుని విషయంలో చేసిన కృషికి తెలుగుజాతి ఎప్పటికీ ఋణపడి ఉంటుంది... వెళ్లపిళ్ల వెంకట శాస్త్రులవారి

శిష్యుడైన వేటూరి ప్రభాకర శాస్త్రి శత జయంతిని, చెన్నపురి ఆంధ్ర మహా సభ, అభ్యుదయ రచయితల సంఘం సంయుక్తంగా, కోరాడ మహదేవ శాస్త్రి అధ్యక్షతను, బి వి యస్సెస్ మణి ప్రారంభకులుగా, బులుసు వెంకట రమణయ్య ముఖ్య అతిథిగా, కొత్తా సూర్యనారాయణ హాలులో జరిపారు. రామచంద్ర, చిన్ని కృష్ణయ్య, వినత, గోపాలకృష్ణ, జి వి యస్సార్ కృష్ణమూర్తి ఈనాటి వక్తలు. . . ప్రతి భాషకూ సహజ పరిణామం ఉంటుందనీ, కవిత్రయాన్ని మించిన కవిత్వం లేదని, నాచన సోముని అనంతరం పదాల గారడీ ప్రారంభమయిందనీ, జగన్నాథ పండితరాయలు కాలందాకా ఆలోచనాక్రమత సంస్కృత భాషని అనుసరించేదనీ, శాసనాలు చదవడానికీ, తాళపత్ర గ్రంథాలు పరిష్కరించడానికీ మౌలికంగా ఎంతో వ్యత్యాసం ఉన్నదనీ ఎన్నో విషయాలు చెప్పారు మహదేవశాస్త్రి. .... ఆమున్నరకి మ్యూజిక్ అకాడమీలో కళాసాగర్ ఫంక్షన్ ఉండటం వల్ల అందరి ఉపన్యాసాలూ వినగల అవకాశం లేకపోయింది. . . . 1915 ప్రాంతాల బలిజేపల్లి లక్ష్మీకాంత కవి రచించిన 'సత్య హరిశ్చంద్ర' తెలుగు ప్రజానీకానికి ఎంతో ప్రియమైన నాటకం. వసిష్ట విశ్వామిత్రుల వివాదంలో, సత్యవ్రత దీక్షకు అంకితమైన హరిశ్చంద్ర మహారాజు పడ్డ కష్టాలూ కడపటి విజయమూ ఒక మోహన్‌దాస్‌ని మహాత్మునిగా మార్చాయి. ఆనాటి పౌరాణిక నాటకాలలో సామాజిక బోధ ఎంత చక్కగా ఉండేదో చూస్తుంటే ఆశ్చర్యమేస్తుంది. చతురంబోధి పరీతమైన భూమిని ఏలిన రాజు సత్యవాక్య పరిపాలన కోసం ఛండాలునికి (వీర బాహుడు) అమ్ముడు పోవడం, తనని బానిసగా అమ్మి అప్పు తీర్చి మాట నిల బెట్టుకోమని చంద్రమతి తన భర్తను అర్థించడం (అది చంద్రమతి చేసిన సూచన – హరిశ్చంద్రుని మనసులో అటువంటి ఉద్దేశం లేదు – ధర్మపత్ని మాటను కాదనలేకపోతాడు). బాలునితో సహా బానిసను కొన్న కాలకౌశికుడూ నానాకష్టాలూ పెట్టిన నక్షత్రకుడూ, ఈ దుష్కార్యంలో తాము నిమిత్త మాత్రులైనప్పటికి నిస్సహాయతకు కలత జెందడం, 'జవదాటి ఎరుగదు ఈ యువతీలలామ – పతి మాట సుదతికి పసిడి మూట.... ', 'మాయామేయ జగంబెనిత్యమని సంభావించి మోహంబునన్. . . ' యిటువంటి మణిపూసల్లాటి పద్యాలు 'హరిశ్చంద్ర' నాటకాన్ని నిత్య నూతనంగా ఉంచుతూ, ప్రేక్షకులని రసార్ద్రతతో రంజింపజేస్తున్నాయి. వేరే ఉద్యోగాలలో ఉంటూ నాటక రంగంపై గల మక్కువతో, అభిమానంతో, అక్షరాలా కళాసేవ చేస్తున్న పొన్నాల రామసుబ్బారెడ్డి బృందంవారు అభినందనీయులు. ఒక్కరు సీటులో నుంచి కదలలేదంటే, నాటకం ఎంత రక్తి కట్టిందో ఊహించుకోవచ్చు. కళాసాగర్ అధ్యక్షులు యమ్మెస్ రెడ్డి, ముఖ్య అతిథులు

సి యస్ రావు, రాజసులోచన నాటక బృందం వారిని అభినందించారు.

. . . . . 26

పామ్‌గ్రోవ్ టెర్రేస్ మీద, 'శ్రీరాజ రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్'లో ఎక్కువ అ క్ష రా లు వున్నాయా, 'శ్రీ కనకమహాలక్ష్మి రికార్డింగ్ డాన్స్ ట్రూప్'లో (Troupe లోని 'e' ప్రెస్ వారికిచ్చిన కరపత్రంలో వొదిలేసినప్పటికీ) ఎక్కువ అక్షరాలు వున్నాయా అనే సందేహం వచ్చినప్పుడు, నాకూ దత్తుగారికీ ('ఆంధ్రప్రభ') ఎదురుగా కూచున్న స ం భా ష ణా రచయిత తనికెళ్ల భరణి, 'కనకమహాలక్ష్మి' స్కోర్ చేస్తోందన్నారు. ఇంత పొడవు టైటిలేమిటి అని లాబ్‌వారు వుక్కిరి బిక్కిరైన వి ష య ం తెలిపారు ప్రొడక్షన్ డిజైనర్ వేమూరి సత్యనారాయణ. శ్రీ తేజా ఆర్ట్ మూవీస్ (విజయ కుమార్ రెడ్డి, రమేష్ రెడ్డి) నిర్మిస్తున్న ఈ కామెడీలో నరేష్, మాధురి ప్రధాన జంట. రికార్డింగ్ డాన్స్ కాబట్టి, హీరో కృష్ణని నరేష్ అనుకరించగా, యన్ టి ఆర్, ఎయన్నార్, చిరంజీవులను అనుకరించేవారు కూడా ఉన్నారు. అధిక సంతానం గల (ఆడపిల్లలు) కుటుంబీనిగా రాళ్లపల్లి, 'ఎస్ బాస్'కి అలవడ్డ ఆనంద మోహన్, వాన్ డ్రయివరుగా భీమారావు మున్నగువారు తమ పాత్రల లోని ప్రత్యేకత గు రి ం చి యిష్టాగోష్ఠిలో చెప్పారు. వంశీ దర్శకత్వంలో రూపొందుతున్న ఈ చిత్రం, ఆంధ్రాలో ముమ్మరంగా వున్న రికార్డింగ్ డాన్సుల స్వరూప స్వభావాలను హాస్యరస ధారతో పులుతెతుంది.

. . . . . 27

మ్యూజిక్ అకాడమీలో మే నెల ఏడు, ఎనిమిది తేదీలలో 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్' స ం గీ త కచేరీలు (Spirit of Freedom Concerts) వియస్‌టి ఇండస్ట్రీసూ (VST Industries Ltd) మద్రాసు తెలుగు అకాడమీ వీటిని సంయుక్తంగా నిర్వహిస్తున్నారు. ఏడవతేదీ జుగల్ బందీలో యమ్మెల్ వసంతకుమారి; విజి జోగ్ పాల్గొంటారు - ర మే ష్ మృదంగం, ఆనందగోపాల్ బందోపాధ్యాయ తబలా. మీనాక్షీ శేషాద్రి ఉత్సవ జ్యోతివెలిగించగా, భూతలింగం (వియస్‌టి మేనేజింగ్ డైరక్టరు) సంగీతం ద్వారా దేశసమైక్యతకు తోడ్పడే ఈ కాన్సర్ట్స్ నిర్వహణలోని ఆంతర్యం వెల్లడిస్తారు. ఎనిమిదో తేదీన సోనాల్ మాన్‌సింగ్ 'ద్వివర్ణ' జుగల్ బందీ నృత్యం – ఒడెస్సీ, భరతనాట్యరీతులు. ఆ తర్వాత వైలెన్ జుగల్ బందీలో యమ్మెస్ గోపాలకృష్ణన్, విజి జోగ్ పాల్గొంటారు వు డ్ లాండ్స్‌లో, అకాడమీ వ్యవస్థాపక రథసారధి టివికె శాస్త్రి, పత్రికా సమావేశం ఏర్పాటు చేసి, మద్రాసు తెలుగు అకాడమీ, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ – ఒకటి మద్రాసు లోను, మరొకటి దేశ వ్యాప్తంగాను - జాతీయ సమైక్యతకు ఏవిధంగా కృషి చేస్తున్నదీ తెలిపారు. వియస్‌టి

తరఫున వారూశర్మ, 'స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్' సంగీత నృత్యాల ద్వారా వివిధ ప్రాంతాల మధ్య ఏవిధంగా వారధి నేర్పరుస్తున్నదీ తెలిపారు. రెండు పాయలుగా పారుతున్న గానవాహినిని 'జుగల్ బందీ' ప్రయోగం ఏవిధంగా సంగమింపజేసి విస్తృత పరిచేది వివరించారు మద్రాసు తెలుగు అకాడమి ఉపాధ్యక్షులు బాలమురళీ కృష్ణ.

. . . . . 29

1959 లో 'ఆంధ్ర ప్రభ' విజయవాడకు తరలి వెళ్లింది. ఆ తర్వాత హైదరాబాదు, బెంగుళూరు, విజయనగరం ఎడిషనులు సంతరించుకొని, ఖివ్వాళ మద్రాసుకి పునరాగమమం. పెద్దలు యల్వి ప్రసాద్ ప్రారంభోత్సవం జరిపారు. ఆయన స్విచాన్ చేసిన అరగంటలో, ఆ ప్రారంభోత్సవ దృశ్యంగల కాపీలు సభికులకు పంచిపెట్టారూ. అంటే, సాంకేతికంగా న్యూస్ పేపర్ ఇండస్ట్రీ ఎంత పురోగమించిందో తెలుసుకోవచ్చు .... ఎక్స్ప్రెస్ ఎస్టేట్స్‌లోని బాంక్వెట్ హాలులో, సంపాదకులు పొత్తూరి వెంకటేశ్వర రావు స్వాగత వచనంతో, మల్లెమాల యమ్మెస్ రెడ్డి అధ్యక్షులుగా సభాకార్యక్రమం ప్రారంభమయింది. 'సౌభాగ్యమస్తు' అంటూ ఆశీర్వదించిన సహజకవి మల్లెమాల, ఈ పట్నంలోని పదిలక్షల తెలుగు ప్రజ కష్టసుఖాలకు మద్రాసు ఎడిషన్ దర్పణం కావాలన్నారు. మనోజ్ కుమార్ సొంథాలియా, పెద్దలు యల్వి ప్రసాద్‌ని సత్కరించగా, సరోజ్ గోయెంకా 'ఆంధ్రప్రభ' ఈ అయిదవ ఎడిషన్‌ని, పాఠకులు ఆదరించగలరనే విశ్వాసం వెలిబుచ్చారు. దినపత్రిక ఎడిటర్ రోజుకి ఇరవైఅరు గంటలు పని చేయవలసి వుంటుందని ఆరుద్ర, చిత్తూరులో తను జాయినైన రోజుల నాటి 'ఉద్యమ భావన' గురించి గొల్లపూడి మారుతీరావు, సంచలన వా_లుగాక సత్యవ్రతానికి అంకితమైన పత్రిక 'ఆంధ్రప్రభ' అని రావుల సూర్యనారాయణమూర్తి తమ ప్రసంగాలలో తెలిపారు. ఈ శుభసందర్భాన సత్కారం పొందినవారు: మాజీ ఎడిటర్ నీలంరాజు వెంకట శేషయ్య, జి కృష్ణ, ఇంటూరి వెంకటేశ్వరరావు, కమలాకర కామేశ్వరరావు, తిరుమల రామచంద్ర (కారణాంతరాల వల్ల ఆయన రాలేకపోయారు) ప్రకాశంగారి ప్రభావం వల్ల, పరిపూర్ణ తృప్తినిచ్చిన ఈ పత్రికా ప్రపంచంలోకి తాము ఎలా ప్రవేశించినదీ చెప్పారు నీలంరాజు వెంకట శేషయ్య. కొండముది దత్తాత్రేయ శర్మ వందన సమర్పణ గావించారు. మద్రాసులోని తెలుగువారు 'ఆంధ్రప్రభ'కు సుస్వాగతం పలుకుతున్నారనడంలో సందేహం లేదు. జీవభాషతో తెలుగు ప్రజాహృదయ క్షేత్రాన బాసించిన 'ఆంధ్రప్రభ,' స్వాతంత్ర్య పోరాటంలో సముచిత పాత్ర నిర్వహించి, దేశక్షేమమూ విశ్వమానవ కళ్యాణమూ ధ్యేయంగా జాతీయ పునర్నిర్మాణానికి, నిర్విరామ కృషి జరిపిన, జరుపుతున్న ప్రజా వేదిక - ప్రజల కరదీపిక.

—యన్నార్ చందూర్

# ముఖచిత్రం

చరిత్రని ఎవరూ చెరపలేరు - కాని, చరిత్ర చెప్పే పాఠాలు ముందు తరాల వారికి ఉపయోగబడతాయి. గాంధీ, నెహ్రూ, పటేల్, అజాద్‌లలో, మౌలానా అజాద్ అవిభక్త భారతావనికి - హిందువులూ ముస్లిమ్‌లూ సోదర భావంతో మెలిగే యునైటెడ్ ఇండియా కు-అంకితమైన వ్యక్తిగా ఆదినుంచీ అందరికీ తెలుసు. 1958తో వెలువడ్డ ఆయన గ్రంథం - 'ఇండియా విన్స్ ఫ్రీడమ్' (India Wins Freedom) -ఆ అభిప్రాయాన్ని మరింత దృఢతరం చేసింది. ....రోజూ ఒక గంట గంటన్నర సేపు ఉర్దూలో ఆయన చెప్పినదానికి ప్రొఫెసర్ హుమయూన్ కబీర్ ఇంగ్లీషు ప్రతి వ్రాసి పరిశీలనకు యిచ్చే వారట. ఆయన సూచనలతో శుద్ధప్రతి తయారయేది. అజాద్‌కి ఇంగ్లీషు రాకకాదు; చాలామంది కంటె ఎంతో చక్కగా మాట్లాడేవారట. అయితే కేంద్రవిద్యా మంత్రిగా బాధ్యతలతో మునిగివున్న ఆయనకు, స్థిమితంగా కూచుని గ్రంథ రచన చేయగల తీరికెక్కడ? అంచేత, ఆ కార్యభారం తనమీద పెట్టుకున్నారు హుమయూన్ కబీర్.... ప్రెస్ కాపీ తయారయాక, అందులో ముప్ఫయి పేజీలు ఆపేసి, నేషనల్ అర్కయివ్స్‌కి పంపించి, తన తదనంతరం ముప్ఫయ్యేళ్లకుగాని అందులోని విషయాలు పుస్తకంలో చేర్చవద్దన్నారు. తన మిత్రుడూ కామ్రేడూ అయిన జవహర్‌లాల్‌కి గ్రంథాన్ని అంకితమిచ్చారు. పుస్తక విక్రయం మీద వచ్చేరాయల్టీలు తన వారసులకేగాక 'ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్‌కి' చెందాలని ఆదేశించారు. ఆ ముప్ఫయి పేజీలూ బయట పెట్టమనే అజాద్ వారసులు ఆ మధ్య కోర్టుకి వెళ్లారు. కాపీరైటు హక్కు దారులైన 'ఓరియంట్ లాంగ్‌మన్స్' తమ ఆమోదం లేనిదే 'నేషనల్ అర్కయివ్స్' వాటిని వెల్లడించరాదన్నారు.... రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తొమ్మిది నెలలలో, బ్రిటిష్ మంత్రి వర్గ సభ్యులు సమాలోచనకు వచ్చారు. ఆర్థిక వ్యవహారాలూ విదేశాంగ నీతీ ఒకటిగా కాన్‌ఫెడరేషన్ వారి సూచన. కాంగ్రెస్ మొదట్లో సమ్మతిద్దామనుకొని, ఆపైన కాదంది; ముస్లిమ్ లీగూ కాదన్నది. ఏడువందల మైళ్లు ఎడం ఎడంగా, బెంగాలూ పంజాబూ రాష్ట్రాల విభజనతో పాకిస్థాన్ ఏర్పడుతుందని జిన్నాగారు అనుకోలేకపోయాడు. అంతర్యుద్ధం తప్పించేందుకు, మరొకమార్గం లేకపోయిందన్నాడు మౌంట్‌బేటన్.... మహానాయకులలో ఒకడైన మౌలానా అజాద్ శతజయంతి సంవత్సరమిది.

వెనకటి తప్పులు మళ్లీ చేయడం గాక కొత్త తప్పులు చేయడాన్ని అనుభవం అంటారు. - ఈబోస్

# మాలతీ చందూర్

నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి - విజయవాడ - 2

సమీక్షలు

# చిత్రజగతి

## మెట్రోవారి 'కాస్ట్‌యెవే' (Castaway)

'కాస్ట్‌యెవే' అను మాటకు అర్థం ఒక మూలకు గిరవాటు వేయబడటం. మధ్య వయసులో వున్న ఒక పురుషుడూ, ప్రాయంలోవున్న ఒక స్త్రీ, నిర్మానుష్యమైన పసిఫిక్ దీవిలో ఒక సంవత్సరం పాటు ఎలా గడిపారన్నది ఈ ఇంగ్లీషు పిక్చర్‌లోని ప్రధానాంశం. మహానగర జీవితంలోని పరుగులతో అలిసిపోయి, కొంతకాలం ప్రకృతి వొడిలో, ఒక ట్రాపికల్ ఐలాండ్‌లో, గడుపుదామనుకుంటాడు పబ్లిషర్ గెరాల్డ్ (అలివర్ రీడ్ - (Oliver Reed) పన్నెండు నెలలపాటు తనకి తోడుగా వుండగల 'భార్య' కోసం అడ్వర్టయిజ్ చేస్తాడు. - అది పన్నెండు నెలల వొప్పందం మాత్రమే; ఆ తర్వాత ఎవరిదారి వారిది. అప్లయి చేసిన వారిలో ఒక లూసీ ఇర్విన్ (అమందా డొనొహూ — Amanda Donohoe) సెలక్ట్ అవుతుంది. ఆ దీవిలో వీరిద్దరి జీవితం మహా తమాషాగా ఉంటుంది. అతనిది అన్వేషణా చింతన, ఆమెది స్వప్నాంచల విహారం. నీటినీలిమలో ఆమె మత్స్య కన్యలా జలకాలాడు. తుంది. ఇద్దరూ కలిసి చేపలు పడతారు, అతనికి తేనెటీగలు కుట్టినప్పుడూ కాళ్లకి గాయాలైనప్పుడూ ఆమె ఎంతో సేవచేస్తుంది. అయితే సెక్స్ పరంగా మాత్రం వశమవదు. పన్నెండు నెలలూ ముగిసి, మర్నాడు బయలు దేరుతున్నారనగా, ఆ తుఫాన్ రాత్రివేళ, అతనిని మనస్ఫూర్తిగా అదరిస్తుంది. ప్రకృతి అందాలకోసం చూడదగిన చిత్రం. దర్శకత్వం: నికొలాయ్ రొయెగ్ (Nicola Roeg).

## త్రిమూర్తీ వారి 'దొరకని దొంగ'

ఇంటి దొంగ, మంచి దొంగ, దొంగల్లోదొంగ, జేబు దొంగ. ఈ వరవడిని ఒకనాటి 'రాముడి' చిత్రాలా యిప్పుడు దొంగల చిత్రాలు వస్తున్నాయి ఈ 'దొరకనిదొంగ' రవి తేజ, (కృష్ణ) ఒక ఉత్తమ అధ్యాపకుని రెండవ కుమారుడు. అతను అయిదేళ్ల పాటు పోలీసు బలగాన్ని హడలెత్తించి, ఆ పైన మంచివానిగా మారిపోతాడు. ఆ ఊళ్లో రెండు ప్రసిద్ధ ముఠాలు వున్నాయి - ఒకటి జాకాల్ ది

(త్యాగరాజు); రెండోది కోబ్రాది (మోహన్‌బాబు). జాకాల్ ముఠాలోకి కొత్తగా వచ్చి చేరిన టైగర్‌రాజా (శరత్‌బాబు), కోబ్రా వారిని పట్టీ గొట్టించి, అధిక లాభాలు తన బాస్ జాకాల్‌కే అందేటట్టు చేయడంతో కోబ్రా, ఒకనాటి తన మనిషి అయిన రవితేజ ద్వారా, టైగర్‌ని హతమార్చే ప్లాను వేస్తాడు - కుయుక్తితో విజయ మందుతాడు. కోబ్రా సుపుత్రుడు శిశుపాల్ (మోహన్‌బాబు) షేరూట్, బ్రవున్ షుగర్ యిత్యాదుల ద్వారా యువతీ యువకులని గంజాయి మత్తులో ముంచి సర్వనాశనం చేస్తూ వుంటాడు. కథానాయిక (రజని) చెల్లెలు (దేవి) ఆ విధంగా తప్పుదారి బట్టి, తలి దండ్రులతోబాటు మంట లలో మరణిస్తుంది. రవితేజ తన అన్న గారిని వేజేతులా కాల్చేటట్టు కోబ్రా చేయగా, ఆ కోబ్రాచేత అతని కొడుకు శిశుపాల్‌ని చంపించడం యిందులోని నాటకీయత. ఈ యాక్షన్ పిక్చర్‌కి – దర్శకులు: కె యస్ ఆర్ దాసు. నిర్మాత: బాజ్జీ. సమర్పణ: డూండీ.

## రాజ్ కమల్
## 'సత్య'

సత్యమూర్తి (సత్య) సవతితల్లికి నోటి దుడుసు ఎక్కువ. ఇద్దరు చెల్లెళ్లలో ఒకమ్మాయి వరకట్న బాధలో ఉండగా, మరొకమ్మాయి పోలీసుయిన స్పెక్టరుని ప్రేమిస్తుంది. ఇరవైవేలూ సర్ది పెద్ద చెల్లెలు కాపరం నిలబెడతాడు; ప్రేమించిన వానితో రెండవ చెల్లెలు పెళ్లి జరిపిస్తాడు. కుటుంబ పరంగా అతను చేసిన సత్కార్యాలు ఆ రెండూను. ఆ తర్వాత గీతను (అమల) ఆదుకొని, ఆమెకు పెన్నిధి కాగల ప్రయత్నంలో ఉంటాడు. నలుగురు మిత్రులతో నిరుద్యోగుల క్యూలో నిలబడే ఈ సత్య (కమల్ హాసన్) ఒకరోజు తన కళ్ల ముందు జరుగుతున్న అమానుషాన్ని అక్రమాన్ని చూడలేక, తనలోని నిద్రాణశక్తిని మేల్కొల్పి ఆంజనేయునిలా విజృంభిస్తాడు. రంగా బృందానికి యితను శతృవవడం వల్ల చక్రపాణి చేరదీస్తాడు. అయితే, ప్రజలను దోచుకోవడంలో యిద్దరూ తోడుదొంగలనే విషయం

సంఘ విద్రోహ ముఠాల కారణంగా, సామాన్యులు ఎలా భయకంపితులై... సాక్ష్యం చెప్పేందుకు కూడా గుండెబలం లేని భీరువులు ఎలా అయినదీ ఈ చిత్ర సన్నివేశాలు చెబుతాయి. కమలహాసన్‌లోని ప్రత్యేక నటనానైపుణి ప్రేక్షకులని మెప్పిస్తుంది. క్రయిమ్ వున్నప్పటికీ దానిని కొత్త దృక్కోణంలో చూపారు దర్శకులు సురేష్ కృష్ణన్. నిర్మాత: కమల హాసన్.

## వై వి సి మూవీస్
## 'ప్రేమ కిరీటం'

క్రికెట్ ఆటగాడు అభిలాష్‌ని (కళ్యాణ చక్రవర్తి), అతని ఫాన్స్‌లో ఒక అమ్మాయి, చెక్కిలిపై చుంబనం

ద్వారా అభినందన అందించడం, ఆ అభిలాష తల్లికి (షావుకార్ జానకి) చిరాకు తెప్పిస్తుంది. ఇలా పబ్లిక్‌గా అడ్డమైనవాళ్ళ చేత ముద్దుపెట్టుకోనిస్తే, తన కొడుకు భవిష్యత్తు ఏంగాను, తమ కుటుంబ గౌరవ మర్యాదలు ఏంగాను ? - అని ఆమె ఆరాటం. ఈ ఒక్క సన్నివేశంతో ఆయా పాత్రల స్వభావలక్షణాలు ముద్రితమవుతాయి ఈ సంపన్నులయింట్లో పెరిగిన చంద్రా (చంద్రమోహన్), అతనిని తనవానిగా చేసుకోవాలని ఆశ పడే టైపిస్టూ (తులసి), ఈ సుప్రసిద్ధ క్రికెటీర్ పేరు ఏనాడూ వినని, అతని బొమ్మ ఏనాడూ పత్రికలలో చూసి వుండని రాధిక (కుష్బు) రైలు ప్రయాణంలో తటస్థ పడటం, వారి ఎస్టేట్‌లో ఆమె వుద్యోగం, ఈ రాధికే పెదనాన్నగారి (గుమ్మడి) ఆదేశ ప్రకారం రంజితకీ (అశ్వని) తను మనసులో నిలుపుకొన్న అభిలాష్‌కీ మధ్య సంధానకర్త కావలసి రావటం, తండ్రికి తెలియకుండా ఆ రంజిత అదివరకే మరొకరికి మన సిచ్చి వుండటం, ఆ రాజా (మురళీ మోహన్,) పునఃప్రవేశం, మధ్యలో విలన్ కొంచెం ఫైటింగుతో, వేలూ వీర భద్రుల హాస్యరస గుళికలతో, శ్రీ హృదయ సౌందర్య దీప్తులని ఎంతో చక్కగా చూపిన పాటి బండ్ల విజయ లక్ష్మి స్క్రీన్‌ప్లేతో, యిది అక్షరాలా 'నీట్ అండ్ నైస్' పిక్చర్. దర్శకత్వం రామ్మోహనరావు. నిర్మాత: ప్రభావతి. సమర్పణ: శంభుప్రసాద్.

## మా న సా వా రి

ఈ కామెడీ చిత్రంలో పెళ్లి కొడుకులు కళ్యాణ చక్రవర్తి, హరీన్; పెళ్లి



కూతుళ్లు కల్పన, సీత. ఒకరు ధనకోటి గారి అబ్బాయి రాజా - అమెరికాలో చదువుకొచ్చిన అధునాతన భావాల యువకుడు, కట్నానికి సుతరామూ అమ్ముడు పోని వరుడు. మరొకరు ధనకోటి గారి కారు డ్రయివరు రాము - డ్రయివరు అయినప్పటికీ యింట్లో మనిషిగా ధనకోటి దత్త పుత్రునిలా పెరిగిన యువకుడు. 'యరేంజ్‌డ్ మ్యారేజెస్' (పెద్దలు కుదిర్చిన పెళ్లిళ్ల) పట్ల ఏమాత్రం నమ్మకం లేని రాజా, ప్రేమా టెక్స్‌టయిల్స్ యజమానురాలి (విజయ) కూతురు ప్రేమని (కల్పన) పెళ్లిచూపులు చూడటానికని వెళ్లవలసి వస్తుంది. యువకులిద్దరూ 'యజమాని-డ్రయివరు' సీట్లూ వేషాలూ మార్చుకుంటారు. మధ్యలో చిన్న మలుపు వచ్చినప్పటికీ, డ్రయివరు భాగ్యవంతురాలి అమ్మాయిని, యజమాని పేదపిల్ల సీతని (సీత) చేబడతారు. కోట శ్రీనివాసరావుది విలన్ పాత్ర. వేలూ వీరభద్రరావూ పుష్కలంగా హాస్యం సమకూరుస్తారు. సీమ టపాకాయల్లా పేలేజోక్స్‌తో, హాస్యరస వల్లరితో ప్రేక్షకులని అలరించే ఈ చిత్రానికి దర్శకులు రేలంగి నరసింహారావు.

## డైనమిక్ వారి 'యముడికి మొగుడు'

మంచిని సుప్రతిష్ఠితం చేసేందుకు శతృవులని చెడామడా బావగొట్టే సుప్రీమ్ హీరో పేరు కాళి (చిరంజీవి). గూడుపుఠాణీ దారుల (గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, రావు గోపాలరావు) కుతంత్రాలు తెలియని ఋజు వర్తనుడతను. రాధ (రాధ) హీరోయిజమ్ చూసి పెళ్ళి చేసుకుంటానంటే, ఆమె తండ్రి స్వయంగా తమ యింటికి వచ్చి నిశ్చయ తాంబూలం యిచ్చి వెళ్లినప్పుడు, అందులో మోసమేమీ లేదనుకుంటాడు. అయితే, ఆ తండ్రి తన బావమరిదితో చేతులు కలిపి కాబోయే అల్లుడిని, యాక్సిడెంట్ చేయించి చంపిస్తాడు.... యమలోకానికి వచ్చిన హీరో యముడిగారితో (సత్యనారాయణ), 'శుభమా అని పెళ్లి చేసుకోబోతూంటే, యిదేమి అన్యాయం, సార్' అని నిలవదీస్తాడు. చిత్రగుప్తుని (అల్లు రామలింగయ్య) తప్పుడు లెక్కవల్ల యిలా జరిగిందని విచిత్రగుప్తుడు (వేలు) విన్నవించగా, ఈ మానవుని దేహం అప్పటికే బూడిద అయిపోయివుండటం వల్ల, ఈ కాళిని పోలిన మూర్తులలో (అడవి మనిషి, ఒక్కడ్నీ మాత్రమే గలవాడు, విషాహారం వల్ల కొద్ది సేపట్లో చనిపోనున్న బాలరాజు, మూడవ మూర్తి ద్వారా పునర్జీవితం పొంది, గౌరికి (విజయశాంతి) చెలికాడై, చివరికి యమ ధర్మరాజు పరీక్షలో నెగ్గి, పరస్పర త్యాగాల కొడిగట్టిన పసిడి మనసుల కన్నెల నిద్దరినీ చెరోవైపునా చేర్చుకుంటాడు. దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి.

---

మనం ప్లానులు వేస్తుండగా మనకు సంభవించేదే జీవితం. —సాండర్

సీరియల్

# 'ప్రతి గురువారం'

గడిచిన కథ: ఆడిట్ బ్యూరో మనిషి, అడ్వర్టయిజర్ అనుకొనే జేన్ మెక్లవిన్, అనుభవాలూ, 'ఆర్కయివ్' వారపత్రిక నిర్వహణలో ఆ భార్యాభర్తల కష్టసుఖాలూ చదవండి.....

పీటర్స్ రయిల్వేల్లో ఏభైఏళ్ళు పని చేసి, రిటైరై, యిప్పుడు మాదగ్గిర అకవుంటెంట్‌గా ఉంటున్నాడు.

పత్రికకి రాయవలసిన ముఖ్య విషయం వ్రాయడం అయిపోయాక, తల ఎత్తి చూస్తునుగదా. ఆ ఉద్యోగస్తుడు మా పుస్తకాలు పరిశీలించి, మహ ఆతురతగా రాసుకుంటున్నాడు ఏమిటో నోట్స్. ఆ విషయం పీటర్స్ చూసుకుంటాడు - నాకెందుకు? - అని నా పని ధోరణిలో పడిపోయాను.

కొద్దిసేపయాక ఆ ఉద్యోగి నా దగ్గిరికొచ్చి, నన్ను కొన్ని ప్రశ్నలు వేస్తానన్నాడు. సరేనన్నాను.

"ఈ ఛెస్టర్ వాలీ ప్రెస్ సంస్థకి అధ్యక్షుడైన మిస్టర్ మెక్లవిక్‌గానీ, ఉపాధ్యక్షురాలైన మిసెస్ మెక్లవిన్ గానీ ఏమీ జీతం తీసుకుంటున్నట్టు కనిపించదే!"

"లేదు - తీసుకోవడం లేదు. అది కొద్దిగా విచారించదగ్గ సంగతే గాని కంపోజిటర్లకీ యితర పనివారలకీ జీతాలిచ్చేసి, బాంక్‌కి ప్రతినెలా కట్టవలసిన వడ్డీ కట్టేసిన మీదట దమ్మిడీ మిగిలితేగా, మేము తీసుకునేందుకు? ఏ నెలకానెల లోటు బడ్జెటే (Deficit) అవుతోంది. మేము కూడా నాలుగు డబ్బులు తీసుకోగల మంచిరోజు కోసం ఎదురు చూస్తున్నాం" అన్నాను సాయలా పాయలాగా.

నేను నవ్వుతూ చెప్పానుగాని ప్రభుత్వోద్యోగి మొహంలో చిరునవ్వు ఛాయ ఎక్కడా కనపడలేదు. "లా ప్రకారం, యిటువంటి కంపెనీలో, అధ్యక్ష ఉపాధ్యక్ష హోదాలో వున్నవారు, గంటకి నలభై సెంట్ల కనీస వేతనం పుచ్చుకుంటూ వుండాలి; వోవర్‌టైము అయితే అరవై సెంట్లు" అన్నాడతను నిక్కచ్చిగా.

నేను చెబుతున్నది అతను పొరబాటుగా అర్థం చేసుకుంటున్నాడని గ్రహించి నేనూ నా భార్యా ఆఫీసులో పనివారలం కాదనీ, కంపెనీ షేర్లలో నాలుగింట మూడొంతులు మావేననీ, అంచేత మేము జీతం పుచ్చుకోకపోయినా,ఒకటేననీ వివరించబోయాను.

"కంపెనీలో పని చేసే ప్రతి ఉద్యోగీ, లా ప్రకారం, వేజ్ అండ్ అవర్ అక్టు (Wage and Hour Act) కి లోబడి జీతం పుచ్చుకోవలసిందే!" అన్నాడతను.

మిషన్ మీదకి వెళ్ళవలసిన ఫారాలు అక్కడ నా కోసం కని

పెట్టుకునున్నాయి. ఆ సంగతి మర్చిపోయాను కూడా.

"అక్కడ డబ్బు లేకపోయినా మాకు మేముజీతం యిచ్చుకోవాలా? అయితే, ఎవరిదగ్గిరయినా అప్పుచేసి, మాజీతాలు మేము పుచ్చుకుంటూ వుండాలన్న మాట. అప్పు జేసేందుకుకూడా మాకు యింక అప్పుపుట్టే అవకాశం లేదు."

"నేను అలా అనడం లేదు, లా ప్రకారం చెప్పాను. మీవ్యాపారంలోని బలుపు సులువులు మీవి - మధ్యని నాకెందుకు ?"

ఇంతలో యిరవైఆరుగురు పిల్లలు హాలోమంటూ లోపలికి వచ్చారు. ఏడూ పందొమ్మిదేళ్ల మధ్యనున్న పిల్లలు వాళ్ళందరూ! "మడిచేందుకు, కాయితాలేమయినా వున్నాయా యివ్వాళ ?" అని వాళ్లు అడిగేటప్పటికి, ప్రభుత్వోద్యోగికి తన చేతిలోవున్న పెన్సిల్ గుటుక్కున మింగినట్టయింది.

కాస్త తేరుకుని "ఎవరు వాళ్లు ?" అన్నాడు.

మేము తడవకి రెండు పేజీలుకంటె ఎక్కువ ఎలా ప్రింటుచేయలేమో, అలా రెండేసి పేజీల చొప్పున ప్రింటు చేస్తున్నప్పుడు మడవడం అనేది ఎలా తప్పనిసరి అవుతుందో, ఆ మడిచేందుకు స్కూలు పిల్లలు వాళ్ల ఆటల సమయంలో మా దగ్గిరకివచ్చి ఆడుతూ పాడుతూ ఎలా మడిచిపెడతారో, అటువంటి పనిచేస్తున్నప్పుడు వాళ్లు ఎంత సరదాగా వుంటారో - అదంతా ఆ ప్రభుత్వోద్యోగికి చెప్పాను.

"వాళ్లు యిక్కడ కూచున్నప్పుడు కుదురుగా కూచుంటారు. మేము వాళ్లకి ఒక రకమైన క్రమశిక్షణ నేర్పుతున్నాం - తృణమో పణమో జేబులో పడుతుందనే ఆశతో, వారది నేర్చుకుంటున్నారు" అంది నా భార్య అక్కడికొచ్చి.

కాని ప్రభుత్వోద్యోగికి మా మాటలు వినిపిస్తున్నట్టు లేదు. దగ్గిర్లోవున్న కుర్రవాణ్ణి ఒకడిని పిలిచి క్రాస్ పరీక్ష మొదలెట్టాడు. మిగతావారు చల్లగా జారుకుందామని చూశారు. కాని, అతడు వారిని భయపెట్టి, "ఎక్కడివాళ్లు అక్కడ వుండండి - కదిలితే వూరుకోను" అన్నాడు. ఏవో ఫారాలు సంచిలో నుంచి బయటికితీసి, వాటి మీద వాళ్ల పేర్లూ, వయసూ, తలిదండ్రుల భోగట్టా - యిలాటివి రాసుకున్నాడు. "వాళ్లందరూ తమ వయసులు చెప్పారు గదా - ఎందుకు వాళ్లని అలా హడలగొడతారు ?" అన్నాను.

తొందర తొందరగా కాయితాల మీద బరుకుతూ, "పదహారేళ్లలోపు పిల్లలచేత పని చేయించడం చట్ట విరుద్ధం. వాళ్లు చెబుతున్న వయసు నిజమో అబద్ధమోనని ఈ దరియాప్తు స్తున్నాను" అన్నాడు.

"చట్ట విరుద్ధం అయితే మానివేస్తాం. పాపం, వాళ్ల పేర్లు ఎందుకు రాసుకోవడం మధ్య?" అన్నాను.

"వాళ్లు చెప్పినది నిజమో అబద్ధమో వాళ్ల స్కూళ్లకి, యిళ్లకి వెళ్లి కనుక్కోవద్దా మరి ?"

?

"Father, they say Rama is an incarnation or Lord Vishnu. Couldn't he for a moment think that golden deer does not exist and that it could be a possible trick by a scheming demon?"

"It is a nice question but try to look at it from another angle. You know Surpanakha episode - she was punished by Lakshmana and that led to the destruction of Khara, Dushana and Trisira - the first bastion of the impregnable fort of Ravana. Further down there was Vali in Kishkindha, Lankhini to guard his island-empire and all that. After thirteen years of pleasant and peaceful living in a hermitage, with only a few months left to complete the stipulated period, Sita had o expedite the end of Ravana, the very objective of her life."

"Yea, that I know. She was Vedavati in her previous birth"

"Ravana knew Sita was fond of deer - he ordered Maricha to take the form of a beautiful golden deer to lure Sita. Both Rama and Lakshmana should be away from the cottage to make it possible for Ravana to abduct Sita - the very act that hastens his doom. Sita knew it all at that moment and she was conscious of being an instrument of Divine Purpose and even great Rama had to behave like an ordinary mortal submitting himself to the Supreme Design" explained Raghu's father.

*SWADHARMA SWAARAJYA SANGHA*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras 600103.*
*(Ph : 514477)*

రెండు రోజుల అనంతరం స్కూలు అధికారి దగ్గిర్నుంచి టెలిఫోన్ వచ్చింది. "మాకు అర్థం కాకుండా ఉంది. ఎవరో ప్రభుత్వోద్యోగి వచ్చి స్కూలు పిల్లల రికార్డులన్నీ మొదటినుంచి చివరిదాకా తిరగేయిస్తున్నాడు. ఎక్కడెక్కడి పాత కాయితాలు బయటికి తవ్వవల సొస్తోంది. యింటర్వ్యూ చేయాలని వాళ్ళని క్లాసులో నుంచి పిలిపిస్తున్నాడు. ఇదంతా మాకు అర్థం కాకుండా ఉంది. నిమ్మకి నీరోసినట్లు, మీర క్కడ నిశ్చింతగా కూచుంటే ఎలా?''

స్కూలు టీచర్లకీ, స్కూలు పిల్లలకీ, స్కూలు అధికారికీ రెండు రోజులు పని చెప్పాడు ఈ ప్రభుత్వోద్యోగి. ఎంత టైము నిరుపయోగమైన కార్యక్రమంలో వృధా అయిందో, చెప్పడం అనవసరం.

ఆ రెండు రోజులూ మమ్మల్ని వొదలిపెట్టి, మళ్లీ మూడో రోజుకి మా దగ్గరికి తయారయాడు. పెట్టీకాష్ వోచర్లు ఒక గుప్పెడు పుచ్చుకు, మేనేజరు రసెల్ని అవి ఏమిటో వివరించమన్నాడు. "3 డాలర్లు - బుచ్; 75 సెంట్లు - రెడ్'' - ఈ ధోరణిలో వున్నాయి ఆ పెట్టీకాష్ వోచర్లు. ఇవేవో జూదపు రసీదులనుకున్నట్టున్నాడు. చర్చి ప్రోగ్రామ్ కాయితాలు తొందరగా ప్రింటు చేయించే హడావుడిలో వున్న రసెల్, అవి బైండర్ బాయిస్‌కి యిచ్చిన బాపతు!- అన్నాడు.

అంతటితో, ప్రభుత్వోద్యోగి పరిశోధనలో మూతనాధ్యాయం ప్రారంభమయింది. నిజానికి ఆ బుచ్‌లూ, ఆ రెడ్‌లూ, ఎవరెవరో మాకు తెలియదు ఎవరో, వాళ్లకి తెలిసినవాళ్ళతో వచ్చి రెండు మూడు గంటలు పనిచేసి నాలుగు డబ్బులు సంపాయించుకు వెళ్లిపోతూండేవారు. వాళ్ళ వూరూ పేరూ మాకెలా తెలుస్తుంది గనక! వాళ్లు పనిచేసేవారు, మేము ఆ పనికి తగ్గ ప్రతిఫలం యిచ్చి పంపించే వాళ్ళం.

ప్రభుత్వంవారి మనిషికి మా పద్ధతి ఎంత మాత్రం నచ్చలేదు. బుచ్‌లూ, రెడ్‌లూ స్కూలు పిల్లలలో కొందరై వుండవచ్చునని అతనికి తోచింది. సుస్పష్టమైన పేర్లు లేని వాళ్ళందరూ స్కూలు పిల్లలై వుండవచ్చునను కున్నాడు. కొందరిని తను యింటర్వ్యూ చేశాడు. ఇంటర్వ్యూ చేయడానికి వీలు కాని వారికి, "అతి రహస్యం - యజమానికి చూపవద్దు" అను ప్రభుత్వ ప్రశ్నా పత్రాలు (Questionnaires) పంపించాడు. ['Confidential - Do not show to your employer']

ఒకరోజు సాయంత్రం, నేను యింటికి నడిచి వస్తూండగా, మందులషాపు దగ్గిర పదిపదిహేనుగురు స్కూలు పిల్లలు, గుంపుగా కనిపించారు. "బాబ్, బాబ్ - దీన్ని నేను ఏమి చేయాలి?'' అంటూ ప్రభుత్వ ప్రశ్నా పత్రం చూపించాడు ఒక అబ్బాయి. ఆ పత్రంలో నలభై ప్రశ్నలు వున్నాయి. తేది, జన్మస్థలం, తల్లి పేరు, తండ్రి పేరు, తల్లి పుట్టింటి వారి పేరు, వయసు, తను ఎన్ని గంటలు నౌకరి చేస్తున్నది, ఎంత

ముట్టుతున్నది - యిత్యాది ప్రశ్నలు వున్నాయి ఆ పత్రంలో.

ఆ అబ్బాయి పేరు రెడ్. అప్పుడే మందుల షాపులో నుంచి బయటికి వచ్చాడు. వారానికి అయిదు రోజులు (సాయంత్రం వేళ స్కూలు కట్టేశాక) మందుల షాపులో పని చేస్తూంటాడు. మిగతా రెండు రోజులూ మా దగ్గరికి వచ్చి మడత పనిచేసి పెడు తూంటాడు. చంద్రమండలంలో లీప్ యియర్లు వున్నాయా లేవా అని వాదించు కుంటూ కాయితాలు మడవడం, పని అని ఎలా అనిపించుకుంటుంది? - అం టాడా కుర్రవాడు.

"ఎంత ముటుతోంది?" అను ప్రశ్నకు ఎదురు గుండా "75 సెంట్లు అని రాయమన్నాను. 75 రెడ్, వోచరు సంగతి జ్ఞాపకం వుంది యింకా! అందుకని వెంటనే చెప్పెయ్య గలిగాను.

ఇంక, ఆ రోజు నుంచి చాలామంది కుర్రవాళ్లు "ఈ ప్రభుత్వ ప్రశ్నా పత్రాలు ఎలా పూరించాలి ?" అని మా ఆఫీసుకి వచ్చారు. అందరికీ చెప్పాను. లా ప్రకారం నేను యిప్పుడు గంటకి 60 సెంట్ల కనీస వేతనం పుచ్చుకో వాలి - కాని డబ్బేది?

ఈ పరిశోధనా పరిణామం నాలుగు నెలల అనంతరం గాని మాకు తెలియ యలేదు.

గంటలూ జీతాలూ మనిషి [Wages



and Hours Man] మమ్మల్ని వుక్కిరి బిక్కిరి చేశాడు. కష్టాలు గట్టెక్కి ఒక దారికి చేరుకుంటున్నాంగదా అనుకునే వేళకి, చిన్న వ్యాపారాలకి సహాయం చేస్తామని పెద్దఖబుర్లుచెప్పే ప్రభుత్వమే మాకు ఎసరు పెట్టింది. మేము చట్టాన్ని అతిక్రమించిన మాట నిజమే - కాని, యిటువంటి చట్టం వుంటుందని కూడా మేము అనుకోలేకపోయాం. తెలియక చేసిన నేరమనీ, యికముందు అలా టిది జరగదనీ పరిశోధనాధికారికి చెప్పు కున్నాడు బాబ్. ప్రభుత్వోద్యోగి ఆరో పించినట్టు చైల్డ్ లేబర్ లా [Child Labor Law] మేము, పనిగట్టుకు ఉల్లంఘించలేదనీ, చిన్న పిల్లలేదో ఆడు తూ పాడుతూ మాకు సాయం చేశారు గాని, అంతకంటె మరింకేమీ లేవనీ కూడా చెప్పుకున్నాడు బాబ్.

ఆర్థికంగా మేము ఫోలింగ్ మిషన్ కొనగల స్థితిలో లేము. కాని, ప్రభుత్వం వారికోసం మేము తప్పనిసరిగా కొన వలసి వచ్చింది. మార్గాంతరం లేదు.

## 18

మర్నాడు ఉదయమే, డవునింగ్ టవున్ నేషనల్ బాంక్ మేనేజరు దగ్గరకు వెళ్ళి – "ఆరువేల డాలర్లు కావాలి" అన్నాడు బాబ్.

"ఎందుకు ?" అన్నాడు మేనేజరు బావిన్.

"ఒక కొత్త మిషను కొంటున్నాను."

"నిరుడేగా కొన్నది ? మళ్ళీకొత్తది ఎందుకు అప్పుడే ?"

నిరుటికీ ఈ ఏడుకీ మేము బాగా పెరిగిపోయాం. ఇప్పుడు మేము కొనదలచుకున్నది నిజమైన ఆటొ మాటిక్ ప్రెస్. ప్రింట్ చేయడమే

కాకుండా మడవడం కూడా చేస్తుంది. ఈ ఆటోమాటిక్."

బాల్డ్విన్ మరికొన్ని ప్రశ్నలు వేశాడు. ఒకసారి అకవుంట్ల సెక్షను లోకి వెళ్ళివచ్చి, బాబ్‌ని అప్పు ఎందుకు కావాలో సహేతుకంగా కాయితంమీద రాసి యివ్వమన్నాడు. బాబ్ రాసి యిచ్చాడు.

"డైరక్టర్లు పదకొండు గంటలకి కలుసుకొంటారు. వాళ్ల బాలా బాలా ప్రశ్నలు అడుగుతారు. ఫలితం ఏమయినదీ మధ్యాహ్నం రెండుగంటల తర్వాత చెప్పగలుగుతాను" అన్నాడు బాల్డ్విన్.

మధ్యాహ్నం రెండుగంటలకి బాబ్ బాంకు దగ్గిరకి వెళ్ళేటప్పటికి 'యింకా అ మీ తు మీ తేల్లేదు. 'ఇంకొంచెంసేపు పడుతుంది - ఫలితం తెలిసేందుకు" అను సందేశ దృక్కులతో చూశాడు బాల్డ్విన్ బాబ్‌ని.

ఆఖరికి బాబ్, బాల్డ్విన్ టేబుల్ దగ్గిరికి వెళ్ళాడు. టేబులుమీద వున్న కాయితాలలోకి చూస్తూ, "ష్యూరిటీగా ఏమివ్వగలరు ?" అన్నాడు బాల్డ్విన్.

"నాకు వున్న ప్రెస్."

బాల్డ్విన్ ఒకసారి అకవుంట్ సెక్షన్‌లోకి, ఒకసారి లెడ్జర్ సెక్షన్‌లోకి వెళ్ళివచ్చి అన్నాడు. "సగం పైకానికి మీ ప్రెస్ పనికొస్తుంది. మిగతాసగానికి మరొకటి ఏదైనావుండాలి. మీ అమ్మగారి దగ్గిర యేవైనా షేర్లువుంటేం అవిగాని, మీ ఆవిడ యేదైనా పుస్తకం రాసి అమ్మివుంటే, అదిగాని ...."

అవును, నేనొక పుస్తకం రాశాను. ఊపిరి పీల్చేందుకు టైములేకపోయినా, కష్టపడి రాశాను. జూనియర్

లిటరరీ గిల్డువారు దానిని ఆమోదిస్సారు. దాని తాలూకు యడ్వాన్సుం కూడా అందింది. ఇటు నా పుస్తకం. అటు వాళ్ళమ్మగారి దగ్గిరవున్న కొద్ది పాటి షేర్లు - ఈ రెండూ కలిసి కాపాడాయి మమ్మల్ని. మాకు స్తోమత లేదు మొర్రో అంటున్నా - ప్రభుత్వం మాచేత ఆ టొ మా టి క్ మిషను కొనిపించింది.

వర్జీనియా రాష్ట్రంలోని నార్‌ఫోక్‌లో వుంది ఆ మిషను. దానిని అక్కడ విప్పడం, తు డ వ డ ం, లారీల్లోకి ఎక్కించడం, యిక్కడ అయిదడుగుల లోతుగల కాంక్రీటు గొయ్యి తవ్వించడం - అంతా హడావిడే ఆ రోజుల్లో. తలకి మించిన పనులు ఎన్ని వున్నప్పటికీ ఏవారం పత్రిక ఆ వారం, టంచన్‌గా వెలువడుతూండేది. ఆ మూడువారాలూ చాలా యడ్వర్టయిజ్‌మెంటులు వుండేవి.

బాబ్, రసెల్, మాకు అచ్చు పరికరాల విషయంలో సలహాలిచ్చే బెన్. మా ప్రింటింగ్ మేనేజరు ఎవ్. తొమ్మండుగురు పనివాళ్ళు - యింత మంది వెళ్లారు నార్‌ఫోక్, ఆ ఆటోమాటిక్‌ని తర్లించుకు వచ్చేందుకు. పన్నెండు టన్నుల ట్రయిలర్ ట్రక్కులో పట్టుకొచ్చారు దాన్ని. సోమవారం ఉదయం ఆ యంత్రం తాలూకుఇరవై రెండువేల విభాగాలూ అశ్వశాలలో నాలుగుమూలలా పేర్చారు.

"ఇవన్నీ విప్పేసి తీసుకొచ్చి, వేటికవి మళ్లీ బిగించడం టైము వేస్టు కాదా?" అని అడిగాను బాబ్‌ని. అది అర్ధరాత్రి వేళ. పనివాళ్లు ఒక్కొక్కళ్ళే తప్పుకుంటున్నారు.

గ్రీజు చేతులతో వున్న బాబ్. ముంజేతితో మొహం తుడుచుకుంటూ ఫక్కున నవ్వాడు నా మాటలకి.

## 19

మూడు వారాల అనంతరం మా ఆటోమాటిక్, అశ్వశాలకి అందాన్ని యిచ్చింది. ఆటోమాటిక్' మహమంచిది గంటకి అయిదువేల కాపీలు చక్కగా మడిచి బయట పడేస్తుంది. రెండేసి పేజీల బెడద మాకు వొదిలి పోయింది.

బుధవారం నాటికి ఎనిమిది పేఫారం పూర్తి చేసి, ఆటోమాటిక్‌కి వున్న రెండు బెడ్స్ మీద, చెరో చట్రం సున్నితంగా ఉంచాం. ఈ కొత్త మిషనులో నుంచి పేపర్లు ఎలా వస్తాయో చూదామని డెబ్బయి ఎనభై మం దిగుమిగూడారు.

ఎలక్ట్రిక్ మోటారు ' కర్-కర్ అని తిరగడం మెదలెట్టింది; గేర్లు రక రకాలుగా మార్చబడ్డాయి; ఇంతలో ఏదో కాయితపు సంచి నేలమీద పడ్డ శబ్దమయింది. చుట్టలా వుండే న్యూస్ ప్రింటుని మిషన్‌లోకి పట్టుకొచ్చే యంత్ర విభాగంలో ఏదో పొరబాటు వుండటం వల్ల ఠఫీమని తెగింది. ఈ కాయితపు చుట్టని ఒక దారిలోకి తీసుకు వచ్చేందుకు బాబ్, రసెల్, ఎవ్ ముగ్గురూ అరగంటసేపు కష్టపడ్డారు. అరగంట అయాక, మిషన్‌ని మళ్లీ వొదిలిపెరు. (ఇంకాఉంది

